# ప్రస్తావన

అస్మన్మిత్రుఁడ వేటుకూరి కవిచం
ద్రా! నీ ప్రసన్నార్ద్ర చాం
ద్రీ స్మేరాననమండలమ్ము వెలుఁగుల్
దీపించు కందోయితో
విస్మృత్యర్థములన్ స్మరించెడి ననున్
వీక్షించి ప్రశ్నించెడిన్
అస్మాకీన పవిత్రమైత్రి కొక చి
హ్నంబేని లేదన్నటుల్.

ఇట్టి ప్రాణసఖున కెట్టి తర్పణ మీయ
వలనుపడునొ! మమతఁ దెలుపనగునొ!
యను చహర్నిశమ్ము వ్యథమానహృదయానఁ
జిలికి చిలికి చింతసేయుచుండ.

కొన్నినెలల్ గతించె నను
కోనివిధంబునఁ గొండవీటి వా
రున్నటులుండి యూడిపడి
రొక్కదినంబున సంజవేళ, మా
చిన్నమువారికిం గలదు
శ్రీముఖ మొక్కటి అవులాన్వయుల్
మన్నన చేసి పంపిరను
మాటలతోఁ జిఱునవ్వుమోముతో.

తల్లేఖార్థము లిట్టివంచు గిలిగిం
తల్ వెట్టి మూల్యూరివా
రల్లుంగుజ్జులుగా స్వయంవరము ప్రా
ప్యంబయ్యె నింకేమి ? వి
ద్వల్లేఖ్యుండగు రంగయాఖ్యుని చరి
త్రన్ శ్రీ కవిబ్రహ్మకై
యుల్లేఖించి ఋణమ్ముఁ దీర్చుకొనరా
దో మిత్రధర్మమ్ముగా.

అని కొండవీటికవి తన
మనమునఁ గల కుతుకమెల్ల మప్పి కృతిస్వా
మి నిజోదంతము లెల్లను
వినిచెన్ రసమధురభావ వీచిక లెసఁగన్

## శుభం భూయాత్



కృతిపతి :
**శ్రీ మూల్పూరి రంగయ్య**



ధర్మపత్ని
**శ్రీమతి చుక్కమ్మ**

శ్రీకల్యాణపరంపరావృత యశశ్శ్రీరేఖ సత్కావ్యక
న్యాకారమ్మున వచ్చి నిన్ వలచె నయ్యా, వైద్యవిద్వన్మణీ !
నీకున్ భాగ్యధనాగ్రయాయికి దయానిర్వేలవారాశికిన్
ఆకల్పాంత మొసంగుఁగాత రమణీ యైశ్వర్య దీర్ఘాయువుల్.

# అంకితము

ఒకనాఁ డుజ్జ్వలసౌధవేదికల ను
ద్ద్యోతించు రత్నప్రదీ
పికలన్ వెల్గిన దాంధ్రరాజ్యరమ ని
ర్వేలా సముద్దీప్త శౌ
ర్యకళాలీలలు పర్వులెత్తినవి ప్రా
జ్యాంధ్రోర్వి గర్వింపఁ దె
ల్గు కవుల్ పాడిరి కావ్యగీతముల ని
గ్గుల్ దేర్చి సోత్సాహులై. 1

ఘనులౌ కాకతివంశమండనుల వి
ఖ్యాతుల్ దిగంతమ్ములన్
జనసంభావ్యములై మహోజ్జ్వలములై
శౌర్యప్రధానమ్ములై
రణవిద్యామహితమ్ములై సుకవితా
రాజ్యమ్ములం దేలి యా
డిన వా ప్రాభవవైభవమ్ములు ప్రతి
షించెన్ యశస్సాంధముల్. 2

పాయలు పాయలై విరియఁ
బ్రాఁకిన కాకతివంశశాఖతో
వీయము నేయముం గనిన
వీరులు కమ్రకులాగ్రగణ్యులై
తోయమువారలై ప్రబల
దోర్బల విక్రమ వీరగాథలే
సాయముగాఁగఁ గర్సెనము
సాయముగామని రిద్ధవర్తనన్. 3

అమ్మహావంశశాఖయం దవతరించి
దిగ్దిగంత ప్రశస్త కీర్తిని వహించి
మూలుపూరివంశమ్ము ప్రభూతమయ్యె
నందు - పుల్లయ్య సుగుణాఢ్యుడై రహించె. 4

జ్ఞానుల్ కృష్ణమ పుల్లయాఖ్యులకుఁ బు
ణ్యామ్ముల్ ఫలింపంగ ల
క్ష్మీనారాయణ వేంకటార్యుఁడు నయ
శ్రీ కాశయాఖ్యుండు వి
ద్యానిర్ణిద్రుఁడు రంగయాభిధుఁడు నో
య్యన్ బూరుషార్థమ్ము లెం
తేనిన్ మక్కువఁ బుట్టువొందినటులై
దీపించి రుద్యన్మతుల్.

తల్లి కడచన్నబిడ్డలై తనరు కతన
చిన్నతల్లి మిక్కిలినేని శేషమాంబ
కృష్ణమాంబను మించి ప్రేమించి పెంచె
నేఋణానుబంధమొ యిది యెఱుఁగరాదు. 6

అనఘుఁడు ధైర్యసార కన
కాద్రినిభుం డగు వేంకటాద్రికిన్
వినుత గుణప్రపూర్ణ రమ
ణీ వరవర్ణిని - అన్నపూర్ణకున్
గానకొని ముద్దుముచ్చటల
కున్ మురిపెమ్ముల కైనవాఁడుగా
మనముల కెక్కి మించె గుణ
మాన్యుఁడు రంగయ దత్తపుత్త్రుఁడై. 7

తానొక దేశభక్తుఁడయి
త్యాగమయోజ్జ్వల జీవియౌనటుల్
పూనినకార్యమున్ విడువఁ
బోఁడొకనాఁడును జిత్తశుద్ధిమై
మానితమూర్తి బాల్యము సు
మమ్ములు తావులు చిమ్మునట్లు వి
ద్యా నయ భక్తియుక్తుల వె
లార్చెను భావిచరిత్ర కుద్దిగా !

కాలేజీచదువుల్ ముగింపకయె తా
గల్యాణమాసింప ని
ల్లాలై చక్కని చుక్కమాంబ కయి సే
యన్ బ్రాయపుం దీరుతీ
యాలం దోఁగిరి క్రొత్తసొంపు లొకవిం
తై మంతనమ్మాడఁగా
నా లేజవ్వన మెంత ముగ్ధమధుర
మ్మానోకదే జన్మకున్. 9

నెనరు పన్నీరు గురియు హృన్నీరజములు
బుద్ధదేవుని పాదాబ్జ పూజసలుపఁ
దత్ప్రసాదమ్మునాగ బుద్ధప్రసాదు
ప్రేమఫలము జనించి వర్ధిల్లినాఁడు ! 10

కట్నని వంశసాగర గర్భ వీచికా
డోలలో నూఁగు ముత్యాలచుక్క
హృదయ సౌందర్య మాకృతిఁగొన్న సత్కళా
శ్రీ ముద్దుమొగముపైఁ జేరు చుక్క
వైద్య శేఖరు జీవితోద్యాన కుసుమానఁ
దియతీపు లూరించు తేనెచుక్క
దేశభక్తుల త్యాగదీధితుల్ రూపమై
వెలసిన చిన్నారి వేగుఁజుక్క

ప్రాణనాథుని స్వాతంత్ర్య పథములందు
జిలుఁగు వెలుఁగులఁ జిమ్మెడి వెలఁది చుక్క
గాఢ దాస్యాంధరాత్రిలోఁ గాంతులీను
చుక్కలకు నెల్లఁ దల్లి మా చుక్కమాంబ. 11

ఆమెను గన్నవారు సుగు
ణాఢ్యులు లక్ష్మమ రంగరాడ్యశో
ధాములు తద్విశీర్ణగుణ
ధర్మకథల్ తెలుఁగుం బొలాలలో
లేములు వాపి స్వర్ణమయ
లేఖనులై పరువళ్లు త్రొక్కరా
ఆమని పొంగులై చిలికె
రా కమనీయ యశ స్సుగంధముల్. 12

ఇట్టి కులీనతామహిత
సిద్ధచరిత్రను జుక్కమాంబఁ జే
పట్టి భిషగ్వరుండయి య
పారకృపామతి వైద్యవృత్తిచే
పట్టె యనాథదీనజన
పాలన లాలనలన్ మునింగెఁ దా
నెట్టి ముహూర్తమందు జని
యించెనో రంగయ ప్రేమమూర్తియై. 13

తనమానసమున విజ్ఞన దేశభక్తి త
న్నిర్బంధములకు వన్నియ ఘటింప,
తన సంఘసంస్కార ఘనదీక్షలో వితం
తూద్వాహములు పెక్కు లుద్భవింప,
తన మనస్సంస్కృతి దర్పణమ్ములుగ వి
ద్యాసంస్థ లెన్నొ ముద్రలు వహింప,
తనసాహితీ విలుబ్ధత కవీంద్రుల కెల్ల
గుప్తదానమ్ములై కొంగునింప,

తన దయాపరతంత్ర నిస్తంద్ర గుణము
హరిజనోద్ధరణమ్మున కురవడింప
తనరు మూలూర్పారి వైద్యవిద్వత్ప్రభుండు
వనితనిర్మాత 'కాంగ్రెసు' భవనదాత. 14

అతని కరుణాప్రపూర్ణ వైద్యాదికమున
వాని త్యాగప్రపూర్ణ సేవాగుణాన
నతని మానస మాధుర్య మాకళించి
మరగి కరఁగిన దేలూరిమండలంబు. 15

సునిశితము సౌకుమార్యమంజులము నైన
నీ ప్రసూతివైద్య ప్రథోన్నిద్ర హస్త
మెంతచల్లనికీర్తి నార్జించెనోయి!
ఈ ఋణమ్మును లోక మెట్లీఁగికొనును! 1

చిఱునవ్వు వెదఁజల్లు సరసప్రసంగాన
ముద్దుముచ్చట లెన్నొ ముసరికొనును
నిడుదమై వెడదమై బెడఁగొందు రూపాన
నందచందము లెన్నొ క్రందుకొనును
లసితమై నిశితమై మెసఁగు కన్గొనలలోఁ
జలువ వెన్నెల లెన్నొ జాలుకొనును
మెత్తనై జొత్తిల్లు చిత్తప్రవృత్తిలోఁ
బ్రేమభాండము లెన్నొ పేరుకొనును

మధుర మధురవిజ్ఞాన సంభరితమైన
మృదుల మృదుల సూత్రార్థ గంభీరమైన
లలిత లలిత బోధామృతకలితమైన
హృదయకౌముది బుధుల రంజింపఁగనును. 17

ఇవి యొక క్రొత్త త్రోవలు స
మీక్షితముల్ మహనీయు లెవ్వరో
జివ గల కబ్బముల్ చికిలి
సేసి రచించి గతించువెన్క త
త్కవితలు ముద్దుసేసి గుణ
గౌరవ మారసి తత్కృతీశ్వర
ప్రవరత కాసచేసి రస
రాజ్యరమావిభవంబు గోరుటల్. 18

నీ వొక త్యాగసుందర వి
నీతమనీషివి, నీ మనోజ్ఞ సం
భావన దేశభక్తి విభ
వప్రథమానము వైద్యశేఖరా!
నీ విచికిత్స దాస్యగుణ
నీరసజాడ్య నికృంతనమ్మురా
నీ వెవరైన నేమి? వర
ణీయుఁడవైతి రసజ్ఞకోటికిన్. 19

ఆ పెదపాడ దెంత చరి
తార్థత సార్థకమై గడించెనో
నీ పిననాఁటి గాథల గ
ణించెడి పట్టుల మీ కులీన వి
ద్యా పరిపూర్ణ కీర్తి కథ
నాదుల నద్దియు నిల్చు; నుత్తమ
ప్రాపణ మెట్టివారికిని
వైభవముల్ సమకూర్చు టబ్రమే. 20

ఎన్నోమాఱులు దేశభక్తిమెయి నీ
విల్లాలితోఁగూడి యా
పన్నానీకశరణ్యమూర్తివయి ని
ర్బంధమ్ములన్ మ్రగ్గితో

యనాఁ నిన్నువరించె మండలప్రభు
త్వాధ్యక్షతల్ రెండుమాఁ;
గ్లెన్నన్ ద్యాగఫలమ్ము లిట్టులయి ప్రా
ప్తించున్ మహైశ్వర్యముల్. 21

నీ నిస్స్వార్థపవిత్రసేవలకునై
నీరాజనం బిచ్చె రా
ష్ట్రానన్ 'కాంగ్రెసు' సంఘసభ్యత చిర
స్థానమ్ము కల్పించి, వి
జ్ఞానోత్కర్షము సర్వభారత సభా
జాతీయ సభ్యత్వమై
రాణించెంగద, ఆఱువత్సరము లే
లా, నీకథల్ సెప్పఁగన్. 22

తావుల్ చిమ్ముచు నేటుకూరికవితో
ద్యానమ్మునం దెన్నియో
పూవుల్ పూచిన వందులో నొకటి యే
పుణ్యమ్మొ నిన్ గోరి సం
భావించెన్ వలపుల్ రహింప, రసభా
వజ్ఞుండవై సాహితీ
సేవల్ సల్పుము కావ్యకన్యకలు నిన్
సేవించి ప్రేమింపఁగా. 23

ఇది మన్మిత్రుని పుత్రిక
మధుసంభృత రస మనోజ్ఞ మాధుర్యము నీ
కొదవించి మదిఁ గరంచును
గొడలేని రసార్ద్రిభావ గుంఫన లెసఁగన్. 24

కలుగున్ నీ కిఁక దీర్ఘమాయువు కళా
కల్యాణసంధాతకున్
వెలలున్ గావ్యరసస్రవంతు లిఁక నీ
విద్వన్మహోద్యాన జ
న్య లతాంతస్థ మరంద బిందువులు చిం
దన్, మూడుపూ లాఱుకా
యలుగా వర్ధిలుగాత ! నీ మధుర సౌ
హార్ద ప్రథాభాగ్యముల్. 25

ఇట్లు,
చిన్నము రామయ్య
ప్రధానాంధ్ర పండితుఁడు,
బోర్డుహైస్కూల్, నిడుబ్రోలు.

# ప్రశంస

తెలుఁగుంబల్కుల తీరుతియ్యనలకున్
దిక్కన్న దిక్కన్నచోఁ
దలలూఁగింపనిప్రోడ లుండరుగదా!
తన్మాధురీ సాధురీ
తులకున్ నోఁచిన యేటుకూరికవిచం
ద్రున్ ధన్యుఁగా నెంచు నీ
యలరాజున్ బలనాటికృష్ణుఁ గని స
ర్వాంధ్రమ్ము నిస్తంద్రమై.

సురభిళ మీమహాంధ్రకవి
సూనము పంచినతావి సోఁకి పై
మఱచితి; మింతలోనె మఱు
మాయ మొనర్చెను దైవ మీవిరిన్;
పరిణతగంధమై ప్రభుని
పజ్జ సుమం బిది వెల్గుఁగాక తె
ల్గురసికలోక మీకొఱఁత
కున్ గలకాలము కుందకుండునే?

ఉన్నకవీంద్రు కబ్బముల
కున్నతిగూర్చుట యబ్బురంబె యీ
చన్నకవీంద్రు కావ్యములు
చాటుట గొప్పతనమ్ముగాని; యీ
పున్నెముపై మరుల్కొని య
పూర్వయశమ్ము గడించుకొన్న మా
యన్నను రంగయాఖ్యుఁ గొని
యాడెద మాల్పురివంశవర్ధనున్.

అవిరతరాజకీయసమ
రాంకితజీవను లైనవారిలో
నెవరికిఁబట్టె నీకవిత
నీకళ నీసభ నీవదాన్యతల్
కవికులకల్పభూజములు
గా నుతు లందెడివార లిద్దఱో
ముప్వురో తెలుంగునన్ గలరు
మూల్పూరిరంగయవంటి సజ్జనుల్.

సంగరముల్ వివాదములు
జాతికి నీతికి నెగ్గుగూర్చి రా
జ్యాంగము నార్చు నన్న పర
మార్థము దెల్ప ననల్పకాల మీ
రంగయకీర్తి నిల్ప నల
రాజుచరిత్ర తెలుంగు భారతీ
మంగళదామబద్ధ నవ
మౌక్తికమై కురియున్ ధగద్ధగల్ !

—తుమ్మల సీతారామమూర్తి

# కవిబ్రహ్మ జీవితరేఖలు

కవిబ్రహ్మ ఏటుకూరి వేంకటనరసయ్యగారు గుంటూరుజిల్లా సత్తెనపల్లితాలూకా పెదకూరపాడు గ్రామంలో జన్మించిరి. తండ్రి భూమయ్యగారు, తల్లి శేషమ్మగారు. సోదరు లైదుగురు. అందు వీరు రెండవవారు. జననము పందొమ్మిదివందల పదునొకండవ సంవత్సర మేప్రియ లొకటవ తేది (1-4-1911).

పురాణశ్రవణముచే భారతమును జీర్ణింపఁజేసికొనిన శ్రీ భూమయ్యగారు తన కుమారునకుఁగూడ భారత శ్రవణాసక్తిని జిన్నతనమునందే కల్పించెను. సామాన్య వ్యావసాయికకుటుంబ మగుటచేఁ దమయింటి పాలేరువాఁడు రుద్రపాటి వెంకన్న పొలముపైఁ ద్రిప్పుచుఁ బలనాటి సుదుల శ్రావ్యముగాఁ బాడుచు వీరరసమును నర నరముల కెక్కించెను. ఈ సంస్కారబలమే తా నెంతగా నెదిగినను వీడక వీరభారత కర్తగా నొనర్చినది.

## విద్యాభ్యాసము

ఊరబడిలో విద్యాభ్యాసమునకు విడుచునాఁడు తండ్రి పంచదారను బాలురకుఁ బంచఁగా మీ యింటను బయటను గమ్మఁదనము వ్యాపించునని యుపాధ్యాయుఁడు చమత్కరించినాఁడఁట.

చిన్నతనంబునం జికిలిచేసిన చిత్తమొకప్పు డేకలన్
గన్నదొ చెప్పఁజాల గుణకారమునాఁడు గురుండు తండ్రితో
నన్నచ కోక్తు లయ్య హృదయ ప్రమదమ్మునకై నవేమొ న
న్నన్నలఁ ద్రావి నీకతనఁ గాఁగలవాఁడ ననున్ మనస్వియై.

(అలుఁగురాజు)

ఇట్లు ప్రారంభవిద్యను గొంత యభ్యసించి, యంతటితో విద్యకు స్వస్తిచెప్పి మాతామహుఁడగు రాళ్ళపల్లి వెంకయ్యగారప్పటికే తన యఱువదియెకరముల భూమిని రామానుజకూటమున కప్పగించి మూఁడ్రప్పొద్దు ద్రావిడ వైష్ణవ ప్రబంధములు కంఠస్థములొనర్చి మనుమని వల్లింపఁజేసెను. కవిబ్రహ్మయు "గాళగాత్ర"ముతో మధుర మధురముగాఁ బాడుచుండెడి వారఁట. అందువలననే స్త్రీపాత్రలయం దెంత యాదరమున్ననూ వీరవైష్ణవాచారము లగ్గుఁబాలతోఁ దాతగారు ద్రావించుటచే బ్రహ్మ నాయనిపై, వాని మతముపై మమకార మడుగడుగునఁ గన్పించును.

ఇంతలోఁ దన పండ్రెండవయేటఁ దండ్రి పరమపదించెను. చదువు నకు స్వస్తిచెప్పి మేడిపట్టెను. పగలంతయు సేద్య మొనర్చుకొనుచు రాత్రులు శ్రీ ఎనమండ్రు మంగయ్యశాస్త్రిగారికడ నమరము, తెలుఁగు, బంచకావ్యములు చదివెను. శ్రీ దామచర్ల వీరరాఘవయ్యగారి కడ సులక్షణసారము నభ్యసించెను. ఈ సంస్కారముతోనే యల్లిబిల్లి కవిత అల్లసాగెను. తన గ్రామములోని యువకులు కొందఱు వీథినాటకములు వేయుచుండ నందు శశిరేఖ, ఉత్తర, చంద్రమతి స్త్రీపాత్రముల ధరించి ప్రజలచే మన్ననలనందెను. ఉప్పెనవాటుగాఁ బల్లెటూళ్లలో "చల్ భజన" లెసరేఁగెను. అందుఁ దాను శిష్యుఁడుగా గురువుగాఁ గొన్ని వసంతములు గడిపెను. ఏమైననేమి సాహిత్యపిపాస కలవారగుటచే నివియన్నియుఁ దృప్తిఁబఱుపలేదు. ఉన్నతవిద్యాభ్యాసమునకే తన మన మువ్విళ్లూఁతలూగ సాగెను.

## ఉన్నత విద్య

పెద్దల, మిత్రుల ప్రోత్సాహముతో నమ్మతలూరు వెళ్ళి యట శ్రీ మైనేని వెంకటప్పయ్యగారికడ సంస్కృతాక్షరాభ్యాస మొనర్చిరి. అచటఁ జదువుటకు గురువులే గ్రాసవాసముల నాదుకొనిరి. అటనుండి కవిరాజు శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరిగారి నూతాశ్రమమున నడుగుపెట్టిరి. ఆ తెనాలియందలి సంస్కృత పాఠశాలలోఁ బ్రవేశ

పరీక్షయం దుత్తీర్ణులై చిట్టిగూడూరు నందలి సంస్కృత కళాశాలలో నుభయ భాషాప్రవీణయం దుత్తీర్ణులైరి. పందొమ్మిదివందల ముప్పది మూఁడవ సంవత్సరమునఁ బరీక్షయైన వెంటనే గుంటూరుజిల్లాబోర్డువారి యాజమాన్యమున నడపు నున్నతపాఠశాలలో నాంధ్రోపాధ్యాయులుగాఁ జేరిరి. ఆ వత్సరమే శ్రీ త్రిపురనేని కవిరాజు వివాహవిధి ననుసరించి వివాహ మొనర్చుకొనిరి. డాబు డంబాల కెంతో దూరమగు నా వివాహ మా ప్రాంతీయులకుఁ గనువిందయ్యెను.

## కవితా వ్యాసంగము

కవితావ్యాసంగము 1935 నుండి చక్కఁగా సాగినదనవచ్చును. అంతకుముందు విద్యాభ్యాస కాలమున రచించిన కందములనెల్ల నేర్చి కూర్చి నీతిమంజరి యను నామమిడి యన్నగారగు శ్రీ వేంకటరామయ్యగారి కంకితమిచ్చి భ్రాతృఋణమును దీర్చికొనెను. తండ్రి కతమున భారతము, పాలేరువానికతమునఁ బలనాటిసుద్దులు, మాతామహుని కతమున ద్రావిడ ప్రబంధములు చిన్నతనముననే జీర్ణించుకొన్నవారగుటచే నీ మూఁడును ముప్పిరిగొని యాత్త్రరాహులకథల కట్టులుచాఁచి నిర్వీర్యమైన తెలుఁగు జాతికిఁ బలనాటి వీరుల కథలు ప్రాణప్రతిష్ఠావహములగునని యెంచి ముందుగా సంజయుని రాయబారము, శ్రీ కృష్ణుని రాయబారమును, వాల్మీకమున నంగదుని రాయబారము బహువారములు పఠించి యుండుటచే నలరాజు రాయబారమును ప్రారంభించిరి. అది తుదముట్టకమునుపే పూజ్యపాదులు శ్రీ ఆచార్య యన్. జి. రంగాగారి పరిచయ భాగ్యమున రైతుజాతి నుద్బోధింపఁ గంకణమూని క్షేత్రలక్ష్మిని రచించి విద్యాభ్యాస కాలమున సంపూర్ణముగా ధనమొసఁగిన శ్రీ తలసిల హనుమయ్య చౌదరిగారి కంకితమిచ్చి దాత ఋణ మీగిరి. ఈగ్రంథముతో నొక్కసారి తెలుఁగుమాగాణము గుబ్బతిల్లినది.

ఇకఁ జిన్నతనమున రచించిన సిద్ధార్థశమమును జక్కదిద్ది ప్రియ మిత్రులగు శ్రీ కొత్త జగ్గకవిగారి కంకితమిచ్చిరి. తిరిగి పలనాటిచరిత్రముపై

ఎక్కువ వేడిమి గురజాల "హైస్కూలు" న కుద్యోగమును మార్పించుకొని యచటి "బైసింగ్రడచే" నాకథల నెక్కువగా వినుచుఁ జరిత్రాంశములఁ గావ్యధోరణి కనువుపఱచుకొనుచునుండ నొక సాంసారికగాథ మనస్సున కెక్కి దానిని ప్రేమాలోక మను పేరితోఁ దెలుఁగు నానుడులతో దేశి కవితకు జవము జీవము నూఁది విరచించిరి. దాని నుద్యోగాదిక మొసఁగి యాదరించిన శ్రీ జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరిగారి కంకితమిచ్చిరి. అచటినీరు సరిపడక చలిజ్వరముచేఁ బీడింపఁబడి తుదకు నిడుఁబ్రోలు "హైస్కూలు" నకు మార్పించుకొనిరి. ఇఁక నచట "విద్యాపోషక" శ్రీ పాములపాటి బుచ్చినాయఁడుగారి సమాదరణము లభించెను. ఆధి వ్యాధులచే డసిలియున్న కవిబ్రహ్మను నిత్యము పలనాటిచరిత్ర రచనకుఁ బ్రేరేపించుచు మునుముందుగా మగువ మాంచాలను రచింప బ్రార్థించిరి. వారియనుమతి ననుసరించి దాని విరచించి శ్రీ బుచ్చినాయఁడుగారి భార్య యగు శ్రీమతి వేంకటసుబ్బమాంబ గారికిఁ గృతినిచ్చి, ప్రేరేపకులకుఁ గృతజ్ఞతఁ దెలిపిరి.

గుంటూరుసీమ రైతుసంఘము గోవాడవారు 1941 లో రైతు హరికథను వ్రాయించి ప్రథమబహుమాన మొసఁగి సన్మానించిరి. 1943 సంవత్సరమున ఖండకృతులనెల్ల 1. జిజ్ఞాసాతరంగము, 2. జీవితతరంగము, 3. సాంసారిక తరంగము లను మూఁడు పాయలుగా నొనర్చి త్రివేణియను నామమిడి శ్రీ క్రొత్త సుబ్బయ్యగారి కంకితమిడిరి. మధ్యమధ్య కాలముల ఏరువాక, బుద్ధిజీవులను నవలలు, చందమామపత్రికకు గేయములు, ప్రత్యేకముగా 'జిబిలిక' యను గేయకావ్యమును రచించిరి. 1944 లో వీరభారత భాగమగు నాయకురా లను కావ్యమును బూర్తియొనర్చి స్త్రీపాత్రయగు మగువమాంచాలపై వన్నెలు చిన్నెలు దిద్దిరి. దీనిని మాలో నొకరగు — ఉభయభాషాప్రవీణ జంపాల వేంకటనృసింహముగారి కంకితమిడి భక్తి ప్రపత్తుల వెలార్చిరి. 1945 లో వచనరచన పరాకాష్ఠ నందునట్లు బాలురకుఁ దెలుఁగుఁదనము రక్తరేణువుల జీర్ణమగునట్లు గాథావళియను పేర మర్యాదరామన్న తీర్పులనెల్ల నానుడులతో జవము, జీవము పెల్లుబుక

రచించిరి. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమువారిచే సంస్థాపింపఁబడిన జాతీయవిజ్ఞాన పరిషత్తున కధ్యక్షపాదులు కాఁగలిగి జాతీయవిజ్ఞానమను పత్రికను వెలువరించిరి. మధ్యమధ్య యువకవులెందఱో వ్రాసిన రచనల సరిచూచి ప్రోత్సహించిరి. 1947 లో - అలుగురాజు రెండుఖండములుగా రచించి కూచిపూడి వాస్తవ్యులగు శ్రీ మేకా గన్నయ్యచౌదరిగారి కంకిత మిచ్చిరి. వెనువెంటనే తెలుఁగురాణులు గుప్తికివచ్చి కాకతీయసామ్రాజ్య ధౌరేయినియగు రుద్రమదేవిచరిత్రమును వీరరసము పొంగులువాఱ విరచించిరి. దీనిని సరసహృదయులు, సౌజన్యమూర్తులగు శ్రీ వేగుంట సూర్యప్రకాశరావుగారిటీవల పందొమ్మిదివందల యేఁబదియాఱులో నా కావ్యగౌరవము విని ముద్రింపఁజేసి శ్రీ కవిబ్రహ్మగారి చిత్తరువును గజాధిరోహణ మొనరింపఁజేసి ఏలూరుపురవీథులలో 1956 జనవరి 14 వ తేది సంక్రాంతి నాఁడు మహోత్సవ మొనరింపఁజేసిరి. ఆ సమయమున శ్రీ కవిబ్రహ్మ వీరభారతరచనలో నవశిష్టముగానున్న యలరాజు రాయబారమును ముద్రణకుఁదేసంకల్ప మొనర్చిన పూజ్యశ్రీ డా॥ మూల్పూరి రంగయ్య. ఎమ్. ఎల్. ఎ. గారి కోరిక నేఁటి కీరీతి ఫలించినది.

## వీరభారత కథా సంగ్రహము

### అలుగురాజు

పదునొకండవ శతాబ్దమునకుఁ బూర్వము చోళులు చందవోలు రాజధానిగా నేలుచుండిరి. వీరెల్లరు బౌద్ధమతావలంబకులు. అందు ధవళశంఖమహారాజు దానదయాపరుఁడు. ఇతనికడ నందూరి కొమ్మనామాత్యుఁడు మంత్రియై వైదికమతోద్ధారకుఁడగు పృథుశర్మ కండదండయైయుండెను. ఈ యిరువురి కుట్రచే బౌద్ధమతము కలగుండు వడుచుండెను. ఇదే సమయమున నుత్తరదేశమున మహమ్మదీయుల పొటెక్కువై పెక్కురురాజులు వలసదీసిరి. అందు హైహయ వంశజుఁడగు నలుగురాజొకఁడు. వీని కులమంత్రియగు రేచర్ల దొడ్డనాయనితోఁ గలసి సుభిక్షములై కలఁత లెసరేఁగు దేశముల నన్వేషింపుచు నాంధ్రదేశము చొచ్చెను. బౌద్ధమత విధ్వంస మాత్మగోరు పృథుశర్మతో రాజును, మంత్రియును జేతులు గలిపిరి. కార్తవీర్యార్జునుఁ డొనర్చిన పాపమంటుకొని యలుగురాజు వస్త్రములు జీడినూనెరంగు కాఁగా నా పావనిష్కృతికై తీర్థసంసేవకై వెడలెననియు, వానివస్త్రము లెట మలినరహితములౌనో యట నుండుననియుఁ బ్రచార మొల్లెడల నొనర్చిరి. ఈ నెపమున నమరావతి వచ్చి కృష్ణలో స్నానమొనర్చి పాపమును దొలఁగించుకొంటిమనిరి. ఇఁకేమి పృథుశర్మను బట్ట పగ్గాలు లేవు. బౌద్ధమత విధ్వంసమున కీనువ్వంగు పడనిపాటులు లేవు. ధవళశంఖ మహారాజునకు బౌద్ధపదాచార్యుల కెల్ల వెంట నపకార మొనర్చుచుండిరి. వీరితో విసివిన చందవోలుభూధవుఁడు మిూఁదోడిన ఫబాంధ

వశముగా సేవచేయునట్లును, దానోడినఁ దనకూఁతు నలుఁగు రాజున కిచ్చునట్లును బన్నిదము చఱచెను. దీనికి రేచర్ల దొడ్డన్న సంతసించి తన రెండవ పుత్త్రుని బ్రహ్మన్నను వీర మాష్టులపై వదలెను. తుట్టతుదకు మాష్టులోడిరి. బ్రహ్మన్న జయించెను.

అనుకొన్నరీతి రాజు తన కుమార్తెయగు మైలమ్మ నలుగురాజున కిచ్చి వివాహమొనర్చి పలనాడుభూభాగమును బిడ్డ కరణమిచ్చెను. దీనితో వీరి పన్నుగడలన్నియుఁ దీరి యమరావతి బౌద్ధారామముల సర్వధ్వంస మొనర్చి నాగార్జునాచార్యుల పీఠమును బదాబదలొనర్చిరి. అప్పటికిఁ బలనాటికి గురజనాయకుఁడు సామంత భూపాలుఁడుగా నుండెను. ఈ గురజనాయకునిభార్య మగనిహృదయమును జూఱకొన్నది. అలుగురాజునకు రాజ్య మప్పగించుసమయమున గురజనాయకుఁడు దనభార్యను మృగము ద్రుంచిన చోటుఁజూపిదానిపేర శాశ్వతస్మృతిచిహ్నమును నెలకొల్పుఁడని ప్రార్థించెను. వాని వినయాదికములకు సంతృప్తినంది గురజ + ఆలు = గురజా లను నామకరణమిడి యచ్చోటును దమరాజధానిగా నలుగురా జొనర్చుకొనెను.

చందవోలు ప్రభువగు ధవళశంఖుని కూఁతురగు మైలమయేకాక భూరమాదేవి, వీరవిద్యాదేవి యను మఱి యిరువురు దేవేరులై యలుగురాజు మనస్సు వడయుచుండిరి. మైలమకు నలగామరాజు, భూరమాదేవికి నరసింగరాజు, వీరవిద్యాదేవికి మలిదేవాదులు గల్గిరి.

# నాయకురాలు

గురజాలకు సమీపమున నున్న చిట్టగామాలపాటిలో చౌదరి రామిరెడ్డిగారి కూఁతురు నాగమ్మ యను నాపె కలదు. ఆమె చిన్నతనముననే భర్తపోవుటచే శస్త్రశస్త్రాది సమస్తవిద్యల నభ్యసించెను. నలగాముఁడు రాజై, బ్రహ్మన్న మంత్రియై రాజ్యము నడపునపు డామె తానుగూడ నొక యధికార మందవలెనని యువ్విళ్ళూరెను. బ్రహ్మన్న వైష్ణవమతమును బహుదా ప్రచార మొనర్చునపుడు శైవులకు వెంపరలెత్తెను. శైవమత ప్రతిష్ఠాపనమునకు శివయోగినిలచెను. ఇతని కా రాజ్యమున నండదండలు లేవయ్యె. తుదకు నాగమను దమ నాయకురాలినిగా నొనర్చుకొని వైష్ణవ మతముపై దండెత్తెను. అటు వైష్ణవమతమునకు బ్రహ్మన, యిటు శైవమతమునకు నాయకురాలు మూల స్తంభములైరి.

ఒకనాఁడు నలగాముఁడు శివయోగియాశ్రమమునకుఁ జని వాని యోగక్షేమముల విచారించెను. తన కందు జరుగు సపర్యలకు విస్మయం పడెను. దీనికిఁ గారణము నాయకురాలనిచెప్పి యామె నా రాజునకు శివయోగి పరిచయ మొనర్చెను. భూపతి యుబ్బి తబ్బిబ్బై నీకేమి కావలెనని సాదరముగఁ బ్రశ్నించెను. పదుగడియలు పల్లెనాడే లధికార మిమ్మని యామె చౌరవతో నడిగెను. ఆపరిచయము నాగమ్మకు మంత్రిత్వమును, నర్మసాచివ్యమును నలగామునియొద్ద కూర్చిపెట్టినది. కుటుంబములోఁ గలహ మోపరేఁపినది. మునుపటి యుద్యోగులఁ ధారా్మరొనర్చినది.

సీ॥ కట్టించినది కోటగడ్డల కెదురుగా జంగమవృద్ధుల సత్రశాల...సృష్టించినది వీరశివభక్తులకుఁగాను సావరమ్మున యందు శైవవీథి...ఇండ్లువాకిళులూరకర్పించుకోలేఁది పెదవి కదపక పిడికిలిపిండుకోలేఁది ... ఆమెసూటన్న అంత యనురాగము ప్రజలలో వచ్చెను. అస్త్రవిద్యా నైపుణ్యమను పేరుతో బాలమల్దేవాదులచే నలగామునిశుద్ధాంతాదులఁగొట్టించినది. దీనికిబ్రహ్మనాయఁడే కారణమని వీరందఱు మాచర్ల కనిపినది. అంతటితోఁ దనియక కోడిపందెమునకు రావించి మెట్టిటో జయించి యేడేండ్లు వలస కంపినది. అంతటితోఁ బోక వెన్నాడి భంగపఱచినది. సమయమునడవి భాగలబ్ధికై వీరమేడపిలో బాలమల్దేవులతో బ్రహ్మన్న కొలువుదీర్చెను.

## అలరాజు రాయబారము

ఆ బ్రహ్మనాయఁడు కొలువుదీర్చి సమస్తజనులఁగలయఁ బరికించి మనమనుకొనినట్లు కాలము గడపితిమి. ఈనాఁడు భాగలబ్ధికై ప్రయత్నింపవలయునన సభవా రేదు లెరిగి పోటుమన్నీలు నిలుపోపలేక తలకొకరీతి మాటాడిరి. అందుఁ బెద్దన, బాలుఁడు, కన్నమదాసు సంధికి ససేమిరా యనిరి. వీరనాయకులు డెబ్బదేగురు కాఁడి మోయక పెనగులాడిరి. ఎవరేమన్నను లోకనిందకుఁ బుయిలోడి బ్రహ్మన రాయబారి నంపఁ గృతనిశ్చయుఁ డాయెను. బాలమల్దేవుల బావమఱఁదియు,నలగాముని యల్లుఁడు నగు రాచమల్లుఁ డీసంధానమున కర్హుఁడని యెంచెను. సభ్యులెల్లరు మేలుమేలని సాధువాదములఁ బలికిరి. ఆ సభలోనున్న తలగలవా రెల్లఁ దమ తమ

పలుకులుగా నివేదింపుమని వారివారి చిత్తానువృత్తులవెంట వాక్రుచ్చిరి.

ఇంతలో సభామందిరమున కోరగా శిబికాధిరూఢయై కొమ్మన ధర్మపత్నియు, నలరాజు తల్లియు నగు చెల్లాంబిక పరుగు పరుగున విచ్చేసిన బ్రహ్మన యెదురుగానేగి వలయు నాచారవిధులఁ దీర్చి కొల్వునఁ దెరమోవంగ నిల్పి వచ్చిన నిమిత్త మ్ముగ్గడించెను. ఆపెయుఁ బొంగి పొరలివచ్చు దుఃఖమును లోలోనఁ గ్రుక్కుకొని నుడువఁ గొట్టుమిట్టాడి తుదకు గద్గదకంఠముతో నీవలన భూతధాత్రికి శాంతి చేకుఱగలదని భావించితి. కాని రాజ్యశ్రీ రిరంసందోఁగువారు కన్నుమిన్నెఱుఁగక కయ్యమునకుఁ గాల్దాఁచుచున్నారు. ఇట్టివారేపనికైనఁ గొంకరు. లేకలేక కలిగిన యీయొక్క "నలకని" యిట్టిపనికంప నామన సొప్పుటలేదని గోలుగోలునఁ గన్నీరు మున్నీరు గావించెను. అంత నాయ డామె నోదార్చి తల్లీ! వీరమాతలు గంటఁ దడిపెట్టరాదు. ఈతులసీదామ మేవాని కంఠమందుండునో వానికెట్టి యపాయములు గలుగవని తన తులసీదామము నలరాజు గళమున వైచెను. చెల్లాంబిక శాంతివహించి యంతఃపురమున కేగెను.

ఇంతచేసిన పలనాటికృష్ణుఁడు బ్రహ్మన్న తనపుత్త్రుఁడగు బాలచంద్రుని వెన్నాడి మెలఁకువతోఁ దులసీదామము నాహరింపుమని పంపెను. అతఁడును నలరాజు లేడెవాఁగు కడకుఁ జేరునప్పటికిఁ గలసి పరిహాసవచనములతోఁ బౌరుషోద్రేకముల నెసరేఁచెను. వాహనములతో వత్తుపట్టును త్తరింప

లేనివారు దమ సొమ్ములు గెలిచినవారి కీయఁబండెములు చఱచిరి. అలరాజువాహనమగు సావరాలజమ్ము ముంగాళ్ళు మూఁత్ర మవ్వలియొడ్డుమోసి పృష్ఠభాగంబునీటఁదోఁగి గూను గిలం బడియెను. బాలచంద్రుని తగరు బిల్లంగోడు వడువున నావాఁక నుత్తరించెను. అనుకొనినట్లు సొమ్ములెల్ల నలరాజు బాలునకిచ్చెను. కిమ్మనక గ్రహించి బాలుఁడు సావరాల మార్గముంబట్టి వీర మేడపి కరిగెను. రాచమల్లుఁ డిది యొక యసదర్థంబుగా భావించి సపరివారముగా గురజాలపురిం బ్రవేశించెను.

తత్రత్యులగు బంధువు లామతింప నిఁగుడుకొల్వులో నుభయుల బలాబలములఁ జేకొని యిట్టి మీకుఁ బరస్పర కలహ మవాంఛనీయమని వాక్రుచ్చెను. నాయకురాలిచేతి కీల్బొమ్మయైన నలగాముఁడు నోరువిప్పలేదు. నాయకురాలు నరసింగరాజును దన యిచ్చవచ్చినట్లు మాటాడి శౌర్యో ద్రేకములు పొంగులువాఱ నలరాజు నెక్కఁబొడిచిరి. ఇంకేమున్నది, కొలువెల్ల జేగురించి పొంగులు వాఱినది. కార్య మనువుదప్పినదని యెంచి యలరాజు తాను నేర్చినంత వాగ్వైచిత్ర్యమును నెఱపెను. అదరించి బెదరించెను. సామమునఁ జక్కదిద్ద యత్నించెను. కార్యవాదియై తన నెఱవాదితనమును బ్రకటించెను. సర్వము నిష్ఫలమై సభ వారికి మ్రొక్కి మ్రొక్కించుకొని పరివారయుతముగా చెర్ల గుడిపాటి మార్గమ్ముపట్టి గృహోన్ముఖుఁడాయెను.

# మగువ మాంచాల

బాలుఁడు సంగడీంద్రతో బొంగరాలాట లాడు చుండెను. ఊరునాడెల్లవచ్చి యా యుత్సవమునఁ బాల్గొనెను. కీచురాళ్ళవలె నీలలు మన్ను మిన్ను రాచినట్లు ధ్వనింప సాగెను. ఆ సమయమునఁ గోమటివేషాంబిక గడ్డిగాల బావి యొద్దున నిలచి యా చోద్యము నోరగంటఁ జూచుచుండెను. జాలెగీలించి రెట్టసత్తువకొలఁది లాగికొట్టిన నా బొంగరము తిరిగి తిరిగి యామెపాదమునఁ దాకెను. దానితో సొమ్మసిల్లి పరిచర్యలచేఁ దెప్పరిల్లి బాలుని జూచి నీ పణతవడ - తండ్రి మొదలుగానైనవారెల్లరు రణరంగమున జీవన్మరణ సమస్య లోనుండ నచ్చుఁబోసి విడిచిన యాఁబోతురీతి నీ వీ యూర సిగ్గులేక తిరుగుచుంటివని వేషాంబిక దూషించెను. అంత నోడ లుడికి తల్లివలన సంగతులెఱిఁగి యవ్వయైన శీలాంబిక దీవనలంది తెపతెప మాంచాలసౌధమున కేగెను. వీర మోహినియగు నామె సౌందర్యమునకుఁ బరవశుఁడాయెను. వీనివాలక మెఱిఁగిన మాంచాల వీరరస మెక్కించి యుద్ధ రంగమున కనిచెను. మాంచాలయుఁ బురుషవేషమున రణ రంగమున దుమికెను.

మిత్రులతో నడచిన బాలచంద్రుఁడు పట్టిన ప్రతిన నెఱవేఱ నరసింగరాయని కంఠముం దునిమి తండ్రి కప్పగించి యోహరి సాహరిగాఁ బోరాడి తుదకు డస్సి నాగానది తీరమునఁ దన నడికట్టువిప్పి నెట్టికొనివచ్చు నాంత్రవల్లికలు విరియఁబాఱ జీవముల విడిచెను. ఆ సమయమునఁ బురుష వేషముననున్న మగువ మాంచాలయుఁ బ్రాణావశిష్టయై

వచ్చి పత్రికకళేబరమున నవఁగి పెనఁగి దివ్యసీమల విహ రించెను. ఆ నాగానది నేఁటికీయుదంతమును మంద్రధ్వనిలో వినుచు చుండును.

ఈ మగువమాంచాల 1942 సెప్టెంబరు 4–వ తేదీ ముద్రణమైనది. దీని విన్నపములో "ఈ వీరగాథ సమగ్ర ముగా వ్రాయఁబురికొల్పిన డాక్టరు మూలుప్వారి రంగయ్య చౌదరిగారికి నా నమోవాకము" లని కవిబ్రహ్మగారు వ్రాసి కొనిరి. అట్లే వీరభారతగాథలో రచయిత తుదిగ్రంథమగు నలరాజు రాయబారమును శ్రీ మూలుప్వారి రంగయ్యగారు ముద్రణమునకుఁదెచ్చుట లత్యంత శ్లాఘనీయ విషయమేకాక కవిబ్రహ్మ కోర్కియు సాఫల్యమందినదని ప్రాజ్ఞులయూహ.

కథలోని యూనుపానులు గుర్తెఱుంగుటకై యీ వివరణ మవసరమైనది. ప్రకృత కావ్య గుణాగుణములు పాఠకలోక మెఱుంగుగాక.

"జీవగల కబ్బములే బ్రదుకు జెప్పెడివే మితర ప్రమేయముల్"

సుధీ విధేయులు

తెనాలి
14-1-1959

జంపాల వేంకటనృసింహము,
కొండవీటి వేంకటకవి



# అలరాజు రాయబారము

వీరమేడపి నున్న హంవీరవరులు
బలసి చనుదేరఁ బసిఁడియందలము నెక్కి
సర్వమంగళ వాదిత్రసంయుతముగ
వేత్రహస్తులు మొనసూప విడిది కేగి.

ఆ బ్రహ్మనాయండు వత్సర శేషంబు కొంత నిరూపించి తదవసరం బూఁది పట్టి కొన్నాళ్ళకుఁ జిర సమయంబు తెగుటకాఁ దలంచి యొండొకనాఁడు వేగుఁబోకన లేచి కాల్యంబులం దీర్చి సూర్యోపాస్తి నెఱపి వైష్ణ వాగమోక్త సంస్కార నియతుండై యుద్దోలగం బుండి డెబ్బదేగురు పోటుమన్నీ లాఁకే గుడికట్టునఁ గొల్వ బంధు మిత్రామాత్య వృద్ధజనంబు నెచ్చరించి సముచిత గౌరవ పురస్సరముగా మధుర వచన రచనాక్రమంబున నెల్లవారలు విన నిట్లనియె.

సమయంబు నడపి యే ష
బ్దము లెండకు వానకోర్చి దండడి వడి స
క్రమమునఁ బా లడుగుటకై
గుమిగూడుట యింతవట్టు గూడదె మనకున్.

మేమును బెద్ద త్రవ్వకొక మేలున కొగ్గిన ధూర్త లేచి శ్రీ
రామయె పెట్ట నీమనుచు అంపిలి మార్గ్మగమై కడింది పో
రాము బొనర్చు చుండు టది రాజును దమ్ములు సైఁచి నాగ భా
మామణి నూఁది పట్టి రది మాన్యుల కెంతటి నాన గూర్చదే.

తరతర మొక్కరీతి నృపధర్మము గాదనకుండఁ బౌరుష
మ్మలవడనీక పాలన క్రియా పరిపాటికి ముల్లువాసి దె
ప్పరములు లేక యేలిన నృపాలురకుం దలవంపు గల్గి యి
ప్పరుసునఁ బోవు రాజ్యపరిపాలన కోపి సహించు టొప్పునే.

ఐనను వారు వీరు నడియాలములుం జెడిపో కొకింత సం
ధానము నిచ్చగించి బెడిదంబులఁ దీఱక కూడి మన్కి మా
మానస మొక్కఁడా భువనమాన్యులు మెత్తురు సర్వలోక స
న్మానము గల్గు ధర్మ మది నాలుగు పాదములం బ్రవర్తిలున్.

కాని విధికృతంబెట్లైన నట్లయ్యెడు. ఇంతకు దాయభాగంబులు
తెగమిఁ గొఱఁత నుఱికి తెగి రండ్రుగాని యి పాప
పుణ్యంబులు మాతల నఱుమునను మొఱకు లుందురే?
అయిన మీ చిత్తానువృత్తి కుచితంబు లాడుఁ డనినఁ
బోటుమన్నీలు మొగంబులు గంటు వెట్టుకొని తలఁపు
లంగిటం గ్రుక్కి తెలివొందియుఁ గ్రుక్కు మిక్కన కున్నఁ
గన్నమదాసుం డున్నమితాననుండై.

[1]పంకజంబు నూడ్చి వాలు కేల నమర్చి
పృస్తెమీాస లోలి బుడ్డగించి
ఱోమ్ముపట్టె మూరెఁ డిమ్ముమై నుబ్బించి
క్రేఁటుకొనుచుఁ గంటగించి పలికె.

చాఁకులతోడఁ గాక యిఁకఁ బల్కులఁ దేఱుట దుర్ఘటమ్ము కా
రాకులఁ గూసినట్టి దురితాత్మకురాలి శిరంబు వ్రయ్యగా
నూకిన నాఁడెపో మన మనోరథముల్ దయివాఱు నేయెదు
ర్లేక చరించు నాపె లవలేశము సంధి పొసంగ నిచ్చునా!

ఎంతటి దుష్ప్రవర్తనకు నేనిఁ దలంకదు చెడ్డవార్త మి
మ్మెంతయుఁ బెట్టు రాజుగలఁ డెంతకునుం దనపక్షమంచుఁ బూ
బంతులె యుక్కుగుండులయి పాఱవె నా కనుసన్న కంచుఁ గే
రింతలు గొట్టి మిమ్ము బెదరించుచు నున్న దదెంత జంతయో!

కోడిపందె మపుడె గురజాలసీమలోఁ
గోఁచ కోళ్లటంచుఁ గూఁత వెట్టె
వడ్డితోడ నీఁగ వలదన్న దానికిఁ
దగవు మాల యునికి ధర్మమగునె.

నోటఁజొచ్చి యఱుత దూఁటిన చందాన
రాజు కొలువు సొచ్చి [2]రజన దీసి
పల్లెషసిని బట్టి బాలమల్దేవుల
బ్రహ్మనాయుతోడఁ బంప వినరె!

---

1 పంకజము = కత్తియొఱ 2 రజన = ఆర్జన.

ఆనాఁటి కర్ధరాజ్యము
తానే భాగించి యిచ్చి ధరణీశ్వర సం
స్థానాధికార మబ్బగఁ
బ్రాణి ద్యూతమున భంగపఱచుట దగవే.

నాఁటికిఁ గైకొంటిరి మో
మోటమి పచరించి వైష్ణవోత్తము లెల్లన్
జేటలఁ జెరిగిన యాబిడ
పోటులు సైరించి నేఁడు పొం దొందెదరే.

చీము నెత్తురు నిలువునఁ జిందుచున్న
పోటుమన్నీలు మీరెల్లఁ బొందుఁ గోరి
నాగమకు దోసిలొగ్గిన నన్నుఁ బోలు
వెంగలికి దేశనిష్క్రాంతి వెలితి యగునె.

కుత్తుకలోని రక్త మొక గ్రుక్కెఁడు గ్రోలెడుదాఁక దాని ను
వ్వొత్తున నోర్వరేని రణవీరు లికెంతటికైనఁ గాని నో
రెత్తుట కున్నదే వలస కేగినచాడ్పున నేఁడు బీరపుం
బొత్తము చంకఁ బెట్టుకొని పోయిన పోకకు మారుగల్గునే.

రాజైనఁ దమ్ములను నీ
గోజున రప్పించి యీ విరోధము లడఁగన్
భోజన భాజనములలో
'రాజీ' కుదిరించి యర్ధరాజ్యం బిడునే.

ములు సోఁకెనేనిఁ దేలని
పలుపోకలు వోవు నాగభామామణి చే
తులలోని కీలుబొమ్మై
కులుకుచు నున్నాఁడు పొందు గూడునె దీనన్.

వైష్ణవ మతంబు సర్వ విధ్వంసమైన
నిలువ నీడుండునా మన బలములకును
శైవులను జేరఁదీసి ప్రచారములకుఁ
బంపుచున్నది నిఖిల భూ భాగములకు.

సిగల నెగగట్టు వారలఁ జేరఁ దీసి
శిక్ష గఱపెను సర్వార్థ సిద్ధికొఱకు
మాఱుమసలెద మంచు సర్దారు లెల్ల
రాయుధము వట్టి శపథముల్ చేయుచుండ్రు.

మంది సిబ్బందిగల యజమానులకును
సూడిదలు పంపి హృదయముల్ చూఱకొనియె
నల్ల లొత్తోడు గాక మా నగరమెల్లఁ
గదలి రాదని చాటని గమిడిలేదు.

పురము పురమునఁ దనపేర బొమ్మఁ గట్టి
గొప్ప జాతరలకుఁ బురికొల్పు చుండె
రాణువుల కెన్నొ వేల గద్యాణములను
బంచె బండారమును బదాబద లొనర్చి.

నల్లమల పల్లెలం గోయనాయకులకుఁ
బారుపత్తెము లిడు మిష నోరుగట్టెఁ
జంద్రవంక సమీప సంచారకులకుఁ
ద్రవ్వి తలకెత్తి క్రొత్త పెత్తనము లిచ్చె.

అనుచుం గ్రోధరసంబు వెలికుబ్బిన చందంబునఁ గందోయి
చెందమ్మిన్ బురుడించుడు నిరువలంకుల నెఱ్ఱ సెరలందోలి.

ఎందును బందెమాడరె మహీపతు లింతలు పుట్టుచోట్ల నే
నెందును గంటినే సభకు నెక్కిన యాఁడుది గద్దరించి ము
న్ముందుగ బ్రహ్మనాయనికి మ్రొక్కి పకాపక నవ్వి మైల పెం
పొందెనుజూడు మన్న దెటులోర్తురు దీనికి మానవోత్తముల్.

అప్పటివారి యెత్తికోలునకు మన యుత్తలపాటున కొక
మందల గలదే. అదియుంగాక నాఁటికి నేఁటికి,

నలగాముని సాచివ్యము
తలపై నిడుకొన్న నెవరు తగదండ్రు సభన్
జలపట్టి గద్దెపై మగు
వలకుం దగనట్టి పలుకు పలుకం దగునే.

ఆఁడుది పీఠమ్మున వా
యోడక వినువారు లేరయో సభలోనన్
బేడికి మీసలు పెట్టిన
జాడన్ బాలుపేదిరనుచుఁ జాటెన్ బెలుచన్.

ఆ సమయంబున,

జంత్రంపు బొమ్మ కైవడి
మంత్రిత భుజగమ్ము రీతి మ్రాన్పడి నాయం
డంత్రమ్ము లూడి నిలిచిన
మంత్రిత్వము తలఁగు మని క్షమాపతి యనఁడే.

అంతంబోక,

కనుగుట్టనేల సింహా
సనమెక్కి ధరిత్రి నడుపఁ జాలరె మగువల్
వెనుక నెటాడినఁ జెల్లెను
బనివినుఁడన నగరె తత్సభాసదులెల్లన్.

వింతలె మనవారికి జగ
జంత యొనర్చిన మహోపచారంబులు దు
ర్దాంత పరాక్రముఁ డీతఁడు
శాంతుండై యునికి నాగసానికిఁ జెల్లెన్.

కావున సంధి సేఁత తగుకార్యముగాదు దురంతయుద్ధ సం
భావనచేతఁ గాని గుణపాఠములన్ దముఁదేర్పరాదు మీ
రేవిధి కొప్పుకొన్నను మహీతలభాగము నెల్లఁ దక్కినన్
బూవులఁ బూజసేయుదు రపూర్వ సమాదర పూర్వకంబుగన్.

తోఁచిన మాత్ర మిచ్చి తమతో సరిగా ననుజన్ము లందఱిన్
జూచినఁ గాక మాఱుకొనఁ జూచినఁ దెంపున లోక మెన్కఁగా
యేచిన నిల్వనీడ గలదే నలగామున కీధరిత్రి కా
కాచియె నాగసాని కతనన్ దురుసెక్కి చరించు నాతఁడున్.

రాచఱికంపుఁ బాడి గనరాదుగదా నలగాము పట్టునన్
వాచవిపోవఁ గోరి మనవా రడియాసలఁ గొల్చిరేని నా
నీచుఁడు మచ్చరించి యవినీతులు చేయన చూచుఁగాన నీ
యాచకవృత్తి కంటె నడియాలము దక్కి చరించు టొప్పగున్.

కావున నుచితానుచితంబులెఱింగి కార్యంబు నడపుఁడు. ఇంత వట్టు నా వలసినట్లాడితి. లోకంబు పాడితోడన సర్వ వృత్తంబులు ప్రవర్తిలుంగాక. ఇంతకుం దక్కి వారి యుద్ధతికిం బుయిలోడుటెంతయు నసత్కల్పంబయి చను. ఈ పైఁదక్కంగల విశేషంబు లరసికొండని సూరెలం దిలకించి యథాసనోపవిష్టుండయ్యె.

అంతటఁ బెద్దన సభికా
భ్యంతర మందుండి లేచి న్యాయం బిది మీ
రింతకుఁ దీరుటఁ దక్కినఁ
జింతించుట తగదు తదవశేషము కొఱకున్.

చెడుకాలంబయి దుర్భరాటవుల గాసింజెంది యేడేండ్లు జే
నేఁడు పొట్టన్ భరియింప లేదె తుదకెంతే రాజ్యభాగంబు ని
చ్చెడుచోఁ దృప్తివహింతుమన్నఁ దగదీశ్రీయుద్ధమై దానఁ జొ
ప్పడు నే నట్టి మహార్థమెవ్వరికిఁ గూర్పంజాల దత్యంతమున్.

వెలమకులంబునం బొడమి విశ్రుతకీర్తి గడించి సంధికిం
దలపడ నేల వారికడ దానము ధర్మమటంచు వేడఁగా
నిలువునఁ బోటువుట్టు ధరణిన్ సగమిచ్చినఁ బుచ్చుకొంద మీ
కలిగినఁ గారుబొల్లని ఖురాగ్రహతిం జవిచూతు రెల్లరున్.

వీఁపులు చెక్కలై నిలిచి వెన్కకుఁ బాళెము లెల్లఁ బాఱ సం
తాపము చెంది కోట్లలకుఁ దగ్గ మగండట లేనినాఁడు మా
పాపము పండెనంచుఁ దలపట్టి తమంతటఁ దారు సంధికై
యేపటి రాఁదలంతురుగణింతురె సాంత్వనముల్ దురాత్ములే.

వాడకుఁ గారు బొల్లఁ డనివారణనేగినఁ బట్టఁబంచి కి
గ్గాడి సుహృజ్జనంబులకుఁ గయ్యము పెంచెఁ దదీయ సేనలన్
బాడిసఁజెక్కినట్టు లిరుప్రక్కలు డొక్కలు డొల్లనేసి చెం
డాడెదఁ గాక చూపఱ కమాంతము గుండెలు గండివాఱఁగన్.

అని యంతనిలుపోపక గద్దియ డిగ్గ నుఱికి.

మొనలు జీరుకాడు మూరైన యఱచట్టఁ
గాసెకోకలోనఁ గలయదోపి
పాచిముడిచి కంచుబల్లెంబు చేఁబూని
దండచేతి కడిఁది కండఁ గమిచి.

కన్నుల రక్తధారలొలుకన్ గడికండఁ దెమల్చి తత్సభా
సన్నులగుండె జల్లన భృశమ్ముగ గర్జిలి భైరవాకృతిన్
మన్నఁట కాలఁ దట్టి నృపమందిరభూములు [1]వాలవాయజా
భ్యున్నతిఁ దక్కి గచ్చులకుఁ బుచ్చలకు న్నెలవౌ టెఱుంగ రే.

కాగుబొల్లఁడెచట కంకటంబెచ్చోట
ఖడ్గమెచట వీరగంధమెచట!
మాతు రేల సర్వశూన్యంబుగావించి
నరపతి ధ్వజమ్ము నాఁటె వత్తు.

అని మొగసాల దఱియ నుఱికినఁ బేర్నిఁడడ్డంబై.

ఉ॥ ద్రేకించిన లాభమున్నదె రణోద్యోగ క్రియారూఢికిన్
భద్రంబే మన సంధి సేఁతకొక పాపంబున్నదే సర్వసం
పద్రాజ్యంబులు కొల్లగొట్టకె క్షమాపాలుండు ముప్పొద్దు తా
నిద్రించున్ వ్యథఁ దక్కి కానఁదగ సంధింపంగ రాదేసుదిన్.

చంపనకోరుటెంతపని శాత్రవనాశన మాత్మఁగోరి సా
ధింపఁగ నొండులేదె యొకతీరున కాతల మ్రొగ్గనేనిఁ గా
రింపక వృద్ధసమ్మతము ప్రీతికిఁ బాత్రము నైనయట్లు సం
ధింపుఁడు మూరిఁబోయి వివదించిన లాభము లేదు పెద్దనా!

---

1. శ్లో॥ వాలవాయో విదూరంచ । ప్రకృత్యంతర మేవవా॥
న వైతత్రేతిచేత్ బ్రూయాత్ । జిత్వరీవదుపాచరేత్॥
వాలవాయ శబ్దమునకు విదూరాగమము. (పతంజలిభాష్యము)

నల్లవా! రాచపోకడలు నవ్వునఁ గ్రొవ్వునఁ దీర్పరాదు వా
రెల్లరు చివ్వకున్ దలఁకరేని 'సవా' లొనరించి పైకొనన్
జెల్లును గాక సర్వజనచిత్త మెఱుంగక యెత్తిరేనియున్
గుల్లయి గోటఁ దీరెడిది గొడ్డటఁ దీఱదు నంత వట్టగున్.

సర్వరాజ్య తంత్ర సంస్థావిశేషంబు
గోటి చెక్కడానఁ గుదుటఁ బెట్టు
నయవిశారదుండు నాయఁకుండఁగ నేరి
కౌను గాదనంగ నలవి యగును.

పలనాటి కొకటి పుట్టిన
మలిసీఁడు తదగ్రజుండు మాటాడినచో
జలనిధు లేకంబయినను
గులగిరు లొరగినను వారి కోటియె నెగ్గున్.

దానఁ జేసి యన్న తగవేది చన్నను
నతని తోడి లోకమనుటఁ దక్క
నింద్ర పదవి యైన నే నొల్లనిది నిజం
బింతవట్టు సేయు కెఱిఁగి కొనుము.

మఱియు నలరాజాదులు బాలమద్దేవులతోడివారై యిమ్మహా
త్ముని పంపుసేయం గమకింతురు. తక్కంగల దెబ్బదే
గురు పోటుమన్నీలు తమతమ స్కంధావారంబులతో
నాయని కార్యఖడ్గముల కానవెట్టి నొత్తుము చత్తుమను
చున్నారు. బాలుం దొట్టి చిచ్చఱపిడుగులం బోని
యనపోతు మున్నగు బాలవీరులు చిచ్చైనం బిడికిలింత
మనుచున్నారు. మారణధర్మంబకాని మీరణధర్మంబింత
కూడునె యని పాలెగాం డ్రగ్గలికమైఁ దెగఁ జూచు
చున్నారు. కానం దుదకుం గయ్యంబో నెయ్యంబో
నిర్ణయింప నీతని తలఁజుట్టి వైదొలంగుటెంతయు శ్రేయో
నిదానంబ. నాఁటికొక్కటియై వలస నడపి నేఁటి కొక్క
రుండవై తెగఁ జూచుట పాడిగాదు. అదియుంగాక,

నాఁటికిఁ గోడిపోరు మన నష్టచరిత్రకు మూలమై సటా
ఝూటములూడ్పఁబడ్డపటు సైంహికవృత్తి సహించినాము మో
మోటమి దక్కి నేఁడు సగముర్వికి భాగము గోరి నార మా
యాటలు సాగవింక సమయానుగుణంబుగ సంచరింపమిన్.

వైష్ణవ తత్త్వవేత్త గుణవార వశీకృత సర్వలోక రో
చిష్ణుఁడు జిష్ణుఁడీతనికిఁ జేయని దేమి జగత్త్రయైక వ
రిష్ణుఁడు విష్ణుఁడిట్లవతరించిన దెల్ల రెఱింగి జీవికా
తృష్ణకుఁ జిక్కి మార్మసలి తెంపు వహింపఁగ శ్రేయ మెట్లగున్.

అనవిని నాయఁడిట్టులను నంతలుసేసి తుదిం దెగించినన్
జను లోక దూఱు వెట్టెదరు సజ్జనమైత్రి దొఱంగు లోకు ల
జ్జనపతి దెల్లఁ దప్పనుచుఁ జాటినదాఁక సహించుటొప్పు నా
తని మరితంబె దాకొని వృథా పరిమార్పక నిల్వనిచ్చునే.

సంధి సేయుటెంత జనపతి దెగుటెంత
కార్యఖడ్గశిక్ష గఱపుటెంత
కాని యబలతోడి కయ్యంబు నెయ్యంబు
తలకు మీఱినట్టి ధర్మమయ్యె.

మిన్ను మన్నుఁ గలిపి మిత్తికై యాడినఁ
దిగిచి తెత్తు సంధిదీర్చి వత్తు
రచ్చకెక్కఁ గాంత రాద్ధాంత మొనరించు
టాత్మ నాశమైన ననుమతింప.

చందవోలు రాజ్య సంరక్షణార్థమై
వెలమ పౌరుషమ్ము వెలిఁగె నాఁడు
నేఁడు పల్లెనాడు నిర్ధూమ దగ్ధమై
సమయు వెలమపౌరుషమ్ముకతన.

కావున శత్రునాశనము కాఁగలకార్యము కాని వైరివి
ద్రావణుఁ డాత్మబంధు వలరా జుభయార్థము కోరి పూర్ణ సం
భావనఁ జక్కపెట్టుటకు భారము పూనఁగలాఁడు తత్కృత
శ్రీ విభవంబులై మన మశేషసుఖంబుల నందఁగాఁ దగున్.

సందేహింపక వానిఁ బంచుటకు శిక్షా గౌరవ ప్రార్థనా
మంద ప్రజ్ఞ లవేల యిట్టియెడ సామాన్యుండె వాఁడెల్లి మి
త్రుం దేచూతుముగాక రండనుచుఁ గార్యారంభ సంరంభ మా
త్మం దళ్లొత్తఁ జనెన్ వినమ్రులు సభాస్తారుల్ తనున్ వెన్గొనన్.

అంతట బుగ్గరా జనుపమాద్భుత సంభ్రమ సంభృత స్థితిన్
సంతసమంది నాయనికిఁ జాఁగిలి సాఁగుచుఁ గొంతమంది సా
మంతులఁ గూడి కొమ్మనృపు మాళిగ కేగి సభాప్రవృత్త వృ
త్తాంతము సాంతమున్విని చితత్పరతన్ దనుఁగొల్చి యుండగన్.

మఱునాఁడు నాయఁడును జి
చ్చఱ పిడుగులు మెఱియత్రైన జాంఘూలికులన్
పఱువాత లేపి తఱిమెను
గుఱుపున కా నృపతి కొలువుకూటంబునకున్.

అంత సముద్దామగజంబుల మాడ్కి బాలమద్దేవులు మున్నుడువ
మంగళతూర్యారావంబులు వినుచు భద్రకలశంబు లవ
లోకించుచు సితచ్ఛత్రచామరాందోళికాది వివిధ రాజ
లాంఛన లాంఛితుండై చోహత్త మల్లురు వెంటాడ
బద్దలవారు బరాబరులుసేయ పగటిదివ్వెలు వెలుంగ
వందిజన స్తవం బెసంగ గంధద్రవంబు మూర్కొని పట్టు
పుట్టంబులపై నడచి చెన్నదేవాలయ శిఖరాగ్రంబునకుఁ
జేమొత్తి మ్రొక్కి ప్రయాణ సన్నాహంబునం బొదలి
కొమ్మరాజు కొలువుకూటముం దఱిసెనట.

గంధద్వీప బంధురమై
గంధోదక పూర్ణ కుంభ ఘటితాంగణమై
బంధు జనాన్వితంబై
బంధిత సప్తచ్ఛద ప్రభా సుందరమై.

ఉదధి పొరలి నట్లు లున్న తత్స్థానంబు
తటియఁ జొచ్చి వేత్రధరులు నడువ
నితఁడు బ్రహ్మనాయఁ డీసర్వ భూభార
భరణకర్త యనుచుఁ బలుక వినుచు.

చెంపలంటి మెఱయు చేరెఁడు పుస్తీలు
కోరమీసములకుఁ గూర్మి నెఱప
నెట్టిడాలు కంట వట్టోడ్డి చూపఱ
కట్టులెత్తి చూడ ననువు పడక.

ఒడ్డోలగం బొరసి చని కొమ్మరాజామంత్రణంబు చేసి సాష్టపదీనుండై ప్రత్యుత్థానంబొనరింప నాయండు మండిగాలిడి చేసేతనతనిఁ దిగిచి పట్టి పునఃపునరాలింగనానామయ ప్రశ్న పురస్సరంబుగా సంభావించి రాజానుమతి నలవరించిన గద్దియనెక్కి బాలమల్దేవ భూవరులు తదర్ధాసనంబున నుద్దీపింప బాదన ప్రభృతులగు నన్నదమ్ములు చుట్టుం బరివేష్టింప నలరాజు కేలువట్టి మన్ననమున్నగాఁ గొలువువారలఁ గలయందిలకించి పేరెలుంగున నిట్లనియె.

తాత తండ్రులనాఁటి పద్ధతు లెసంగఁ
జుట్టపక్కాల వదువునఁ జూచు కొనెడు
మీకు మాకొక్క బాంధవమే కొ అంత
గాని వేఱున్నదే కార్య గౌరవముల.

పూజ్యులు మీవారలు సా
మ్రాజ్యమ్ములచేతఁ బెట్టి మసలిన, మీరై
రాజ్యాధికార గౌరవ
భోజ్యంబులు సేయమయ్య భూభాగములన్.

కూఁకటి నాఁడే మాపలు
పోకడలం దిద్ది తగిన బుద్ధులు సెప్పం
దేఁకువ గలిగితిమిది మీ
శ్రీకారాశీర్వచో విశేషము కాదే.

వాకున బోఁకున నెడఁగన
రాక జయశ్రీ వరించు రాజన్యులరై
పాకారి వైభవంబున
సాఁకిన మీ ప్రాభవ ప్రసాదము లసదే.

కులముండి గోత్రముండియుఁ
గలిమికి వెలియైన మాత్రఁ గసరక మాయెం
గిలి మూఁతి ముద్దు గొనినా
రలు మిము బోంట్లున్న వారె రాజన్యులలో.

ఇంత చనవుఁ జేసి యీ యున్న సభ్యుల
కాటు పోటులున్న నధిగమించి
యారసత్వ భాగమడుగంట నీక త
మ్మాదరింపుఁడనుచు నడుగుఁడంటి.

సర్వంసహాచక్ర సంస్థాపనాచార్య
తాత పాదుల కెగ్గు దలఁచు నపుడు
తరతరంబుల నాఁటి ధర్మ సాచివ్యంబు
విచ్చల విడి గోలుపుచ్చినపుడు
అన్న పెద్దన్నకింతని చేరఁదీసి పై
పాఁతతో నిలువెళ్ళఁ బంపి నపుడు
కూటికాపడి గోడు గుడిచి కేలొగ్గిన
సిగ్గు వాయఁగ విమర్శించినపుడు.

మానుపట్టని మీ యభిమానములకు
నాగడపుఁ జేఁతలకు నొక హద్దు గలదె
నాఁడె తీఱును మా మలినీఁడు పెద్ద
నాభికొక చెల్లికట్ట యై యడ్డకున్న.

కోడిపందెము నాఁటి కోపాగ్ని తీవ్రత
 వీర పఠాలుని వేఁడియూర్పు
మందవట్టిన నాఁటి మానావమానముల్
 కన్నమనీని క్రేఁగంటి నీరు.
అడవిజమ్ముల రేవులందుఁ గల్పిన విషం
 బద్దీడు బద్దీడు నాగడంబు
శ్రీశైల యాత్రలోఁ జేసిన మారాము
 బాలమల్దేవుల జాలి పెంపు.

మున్నె చవి చూచి రూపఱి యున్న నుదుకుఁ
బాలు చిందిన సెల వేసి పట్టు రాక
కాండ్రు మనుచున్న పలనాటి కాఱు పులుల
కగ్గమొకఁడుండునే పౌరుషాగ్ని రవుల.

పగ రాజ్యంబున కిచ్చగించితిమిపో శాంతంబు దైవాఱఁగాఁ
దగు కర్జంబులఁ జక్క దిద్ది యిది యర్థంబిద్ది రాజ్యంబు మీ
కగు నేనిన్ గొనుఁడన్న పాపమునఁ బోఁడా ! జీవనార్థంబు రె
ట్టిగ నీఁ దక్కిన మానె పొట్టకయి జట్టెంబైన నీఁ గూడదా !

తానైనం దెగి పోటు సూపిన యథార్థంబాకళింతౌను సం
స్థానాచార్యులు కూయి వెట్టిరని విధ్వంసమ్ము నాశింతు రే
న్యూనత్వంబొడిగట్టి తా నబలతో నూరేగుచున్నాఁడు మా
మాన ప్రాణము లొల్లఁ బోయినవి నిర్మర్యాదమై నీచమై.

ఏ నాఁడు నడచిరో యీ దివ్యభూముల
    ధర్మదేవత వెన్నుదన్ని నిలువ
ఏ నాఁడు మెఱసిరో యీ వీర బయళుల
    వలగొని పౌరుషాగ్నులు వెలుంగ
ఏ నాఁడు కూర్కిరో యీ నాఁపబండల
    విశ్రాంతి విభవమ్ము వెల్లి విరియ
ఏ నాఁడు పీల్చిరో యీ స్వతంత్రానిల
    మ్మనుపమ ప్రాభవ మ్మగ్గలింపఁ.

దత్ప్రభావము దన పేరఁ దఱిగి విఱిగి
వలస వోయినదీనాఁటి కలుగురాజ !
కాని మన్నీల కన్నీట లీనమయ్యు
నప్పుడప్పుడు చిగిరించు నాత్మలందు.

ఏడేండ్లు వలస వోయిన నాఁటి నిబ్బరం
    బనుభవనీయమైనదియె మీకుఁ
గట్టు పోతుల రాచగంగును రప్పించి
    కోడిపోరున గెల్చుకొనుట వినరె
విడిదిచ్చి మృష్టాన్నమిడి విషంబొడఁ గూర్చు
    టాబాల గోపాల మరయ లేదె
కొండ కోయల నెల్ల గూపెట్టి తల గిల్లి
    మొల వేయఁ జూచుట తెలియరాదె

మన్నె భూముల మా యాలమంద నాఁగి
గువ్వకోల్గొని మముఁ గన్ను గొట్టుచెంత
వారి నెఱియింప దా! రాజు వర్తనంబు
లన్ని వేళలఁ దల క్రిందులయ్యెఁ దలఁప.

ఎంగిలి పాలి వారిఁ దుదికింతలు సేసి ధరాధినేతవై
పొంగుచు నెత్తిఁ గట్టుకొని పోయెడిదేమి పరుల్ తలెత్తి మీ
వంగడ మిట్టి దంచు వినువారల వీనులు పోటువుట్ట దూ
ఱంగ మకించి రామనసు ఱూత నమర్చినదేమొ భూవరా!

సంగతియె యెల్లతమ్ముల
ముంగలఁ బాలీను దోలఁగి పో పొండని యు
ద్ధాంగణమున కే మొగమున
భంగించుట కరుగువాఁడొ భ్రాతలనెల్లన్.

చలపట్టి బాలమద్దే
వుల మొగ్గరమందు నిల్వఁ బురికొల్పెద మా
తల వెన్నుఁ దన్ని నిల్తుము
తలఁ దీయునో లేక తానె తఱుగం బడునో.

చుట్టును ప్రాణబంధువులు ప్రక్కడు వృద్ధజనంబు బాలురున్
నెట్టన నిల్చిరేని ధరణీపతి తజ్జను లందఱన్ గదా
ఘట్టన చేయునో హృదయ కందళమున్ జిగిరించి ప్రేమకున్
బట్టము గట్టునో తెలియవచ్చెడు నెల్లి రణాంగణమ్మునన్.

కాని సర్వానర్థంబుల కాకరంబగు వీనిపొంతఁ బోనేల యన.

యుద్ధ మొనర్చి గెల్తుమను టొప్పదు గాని యఖర్వ గర్వ సం
బద్ధ మనస్కులం దిగుచు మార్గ మికొక్కటి గానరాదు మే
ముద్ధతి దక్కియున్కి సకలోర్వి తలమ్మొక దూఱు వెట్టుచో
నిద్ధర నిల్చియుండువఱ కిద్ధచరిత్రకు జీవ ముండునే.

వారును వీరు శ్రీ వడసి వర్ధిలుటెంతొ సుఖాస్పదంబు గా
కారయ నొండు కీడు గలదా! మఱియాదఁ దలంగి కేరు వా
రూరక భాగ మీయరని యుద్ధ మొనర్ప సబాంధవమ్ముగా
నీఱయి పోదె వంశము వినిర్మల కీర్తికి నగ్గు పుట్టదే.

మొగ్గరమందుఁ జొచ్చి బరిముందు 'సనా' లొనరించి నిల్చినన్
నెగ్గునె రెండు పక్షములు నెత్తుటి కూటికి వారు వీరు కే
లొగ్గిన సంతలోన విజయోన్నతి త్రాసునఁ దూచినట్లు కాఁ
దగ్గది గాదు నాఁటికిఁ బదంపడి యేదరి ముల్లుసూపునో.

ఓటమిఁ గొన్న పక్షములు యుద్ధ తలమ్మునఁ గ్రుంగి బ్రుంగుఁ బో
రాట జయించు వారు స్వగృహమ్మునఁ గ్రుంగుట వాస్తవమ్ము బా
హాటముగా వధించిన మహామహులం దలపోసి వేఁడి క
న్నీటఁ దపించు కంటెను గణింప నసహ్య మిఁకొండు గల్గునే.

పాపపుఁ జేఁతకై యుభయ పార్శ్వము లూఱటఁ దక్కి నిత్యమున్
రేపులు మాపులుం బలవరించెడు చిత్తము లుత్తలం పడన్
సాపడమాని పౌరుషము సచ్చి పగన్ వగ గొన్న వేళలన్
రూపటి నట్లె పైఁగ నది ఱొమ్ముల కుంపటియై యలంచెడున్.

కొండికమై చెడం దలఁచి కోల్తల సేసి తమంతటన్ భుజా
భండన పాండితీ విభవ పద్ధతి మార్కొని రేని నీ తలన్
జండ పరాక్రమ క్రమ విశారదు లోపిన యంత తీర్తురేఁ
గండలు గుండెలుం దఱుఁగు కయ్యము సెయ్యఁ బ్రుఁదీరు తియ్యమే.

కావున రెండు పక్షములు కయ్యము దక్కి సుఖ ప్రసంగతిన్
శ్రీ విభవమ్ములై నెవరి సీమలు వారలె యేలు నట్లుగాఁ
గేవల సంధి గాక దృఢ కీర్తికి మైత్రికిఁ దానకంబు గా
నీవొనరించి రమ్ము గణనీయుఁడ వయ్యెద విట్లొనర్చినన్.

మీరును వారు బంధువులు మేమెకదా పెఱ వార మందుఁగోఁ
గూరిమి యల్లుఁ గుఱ్ఱఁడవు గూర్చెడివాఁడవు ఱేపొ మాపొ ధా
త్రీరమ సర్వమున్ భవదధీనము కాఁగల దిట్టి నీవు మా
కోరికఁ దీర్పఁ బూన సమకూడనిదున్నదె యెల్ల వెంటలన్.

ఇరు వాఁగు లొక్క తలమై
పొర పొచ్చెము దక్కి శత్రు భూమింజయులై
గఱి వోక నిల్చిరే నొక
యుఱవున దీపించి మించు నుభయ బలంబుల్.

మా పనుపున నీ సంధా
నోపాయము వాటెనా! సముజ్జ్వల రాజ్య
శ్రీ పాద పద్మ విభవ
స్థాపనకోపిన విధానఁ జాలుదు మధిపా.

పరువొక్కఁడె మన తొల్లిటి
చరితకు శ్రీరక్ష దాని సవరింపఁగ నీ
వెఱవొందు దక్క నలభూ
వర వేఱొకఁడున్నదయ్యా పరికింపంగన్.

లోఁగడఁ బంచిన సమభూ
భాగంబుల నిచ్చిరేనిఁ బరువగు నటు గా
కాగడము సేయఁ దలఁచినఁ
దూఁగినవఱ కిండటంచుఁ దుది కనవలయున్.

అంత బెట్టిదంబు లాడిన మారాడ
కాతలంపు లెఱుఁగు టవసరంబు
సూది మోపినంత సూత్న్యంశముండిన
రాగఁ దేలి పలుకు నాగసాని.

అయిన మీ రెఱుఁగని యర్థంబు గలదె. అర్థార్థులకెల్ల తెఱంగులు సంసిద్ధంబులై యుండు. కార్యాకార్య విచక్షణుండవు. నయానయాచరణ చణుండవు నయిన నీకడ నింత వట్టాడుట మాఱుటనోరం గారాకు మేసినట్లయ్యెడు. రాత్రిం దివములు శత్రు నిబర్హణమునకుం గడంగు నాయకురాలి నూఁది పట్టి రాజు పలుపోకలం బోవుచున్నవాఁడు. తమ్ములు నట్టివార. తామన్నించు పాలెగాండ్ర కొక పాడి గలదే! మువ్వాల భీమునిం బోని చివ్వాల బెబ్బులుల కానవెట్టిన మాత్ర మిన్ను మన్ను గలపి

తాళంబు వేయ సత్తాడు చున్నవారు. నిన్ను మన్నించు నరసింగరాజు కేల్వట్టి మా పంపు సేయుమన్నఁ జాలమి వెట్టు నను సంశయ మొదవుచున్నది. మజ్జన భోజన పానానులేపనాదుల యందు జాగరూకుండవై గతం బాత్మఁ దలఁచి వర్తింప వలయు. చుట్టతికంబు నెఱపి మొఱకలై తెగఁజూతురు. ఏన వలంతిని. బాలమద్దేవుల కార్య ఖడ్గంబులు నీ యాదల నిల్చి యున్నవి. మాను యని మన్నింపక "యతో ధర్మ స్తతో జయ" యను ధర్మ సూక్తిని బాటింపుము. తక్కుం గల వివరమ్ము లరసి కొనుము. నా తలంపింత వట్టు గాన నటు వోయిన మొగంబునఁ గొలువు వారలకు నా నమస్కారణంబునకు మాఱు నైదగ్ధ్యంబు మెఱయ వాచా వాత్సల్యంబు నెఱపితి నను. ఇంత యెందుకంటేని.

అలుగు రాజవరున కభివాదన మొనర్ప
నుక్కుఁ కంబ మగిలి వ్రక్క లయ్యెఁ
దుదికి రాచ పుండుతో బ్రహ్మ సాయుజ్య
మంది నాఁడు దాన సంటెఁ జుమ్మి.

అను నంతలో నలరాజతిభక్తిమై నంజలి ఘటించి.

ఏమిది పూజ్యచరిత్రుల
రీమాత్రకు సంశయింతురేలా సర్వ
క్షేమంకరములు భవదీ
యా మోఘాశీర్వచస్సు లఘుము లడంచున్.

పలికిన వేద వాక్యములు పట్టిన దివ్య శరాసనంబులున్
దలఁచిన నార్త రక్షణము తన్పిన దీన జనార్థి కోటులన్
వలసిన నింద్ర భోగములు వచ్చిన దుర్ణయ చిత్త వృత్తులన్
నిలిచిన ధర్మ గేహముల నేర్పిన నీదృశ నీతి నిష్ఠలున్.

తలఁపు తోడ నర్థ తాత్పర్య చింతన
మలఘు చింతతోడ నర్థ సిద్ధి
యర్థ సిద్ధితోడ నన్యోన్య మైత్రియు
మీక చెల్లు నెవరి కాకళింత.

ఘటనా ఘటన సమర్థుల
రెటు లాడినఁ జెల్లుఁ గాక యెదురున్నదె మీా
పటు మంత్ర తంత్ర శక్తికిఁ
జిటిలిన పిసరంత విధి నిషేధము లందున్.

కాలానుగతికిఁ జిక్కిన
వ్రేలారిచి యంద్రు గాక వెంబరవిత్తుల్
నాలుకకందున తావక
లీలా గుణ గౌరవమ్ము లేశం బైనన్.

సైరణ దక్కిన కుల క్షయ
కారణముల కోపి మిమ్ముఁ గాదని రేనిన్
మేరువు గుండెలపై నిడి
కూరికి నట్లుండు శత్రుకోటికిఁ దలఁపన్.

అయిన నా యోపిన కొలంది

ఎదురెఱింగి యద నెఱింగియుఁ
బదువుర భావంబు లెఱిఁగి బ్రకృత మెఱిఁగియున్
బదనున కైన విధమ్మునఁ
గుదిరింపం జూతు బుద్ధి కుశలత మెఱయన్.

గరువతన మ్మొగిఁ జూపినఁ
ధరములు ముకిళింత్రు వీలు గల్గిన బ్రేవుల్
పురివెట్టి త్రోడఁ జూతురు
పరువే "తూ నాదు బొడ్డు పా"లనుచొట్లన్.

ఎండ వాన నాక యేడు హాయనములు
కష్టనిష్ఠురములఁ గడచినారు
సమయ మెఱిఁగి నేఁడు సగ భాగ లబ్ధికి
నాస చేసి నార లర్థులట్లు.

ఇంతట నైనఁ గృతంబు మఱచి బెట్టిదంబు లాడక తా మన్నించు ప్రబుద్ధుల కుచితంపు మెలపున నింత వట్టగును గాదనిపించు కొను టెంతయు సజ్జనలక్షణంబవు. ఎల్ల వెంటల నర్థిజన సమర్థనంబు వృద్ధసమ్మతంబు నిహాపర సాధన సమృద్ధంబునై యుండు. కావున సర్వశ్రేయో నిదానంబైన భవద్వచనంబున కన్యథా కరించినఁ దత్ఫలంబు తోడన యనుభవింపక తీఱదు. అంత శ్శుద్ధి

కర్థసిద్ధికిఁ దాఁపురంబైన మీప్రాపకంబునకు వెలి యైన మా బ్రతుకునకు మెదుకునకు మాత్ర మెక్కడి చక్కటి. రాజ్యశ్రీ రిరంసం దోఁగి కన్ను మిన్నుఁ గానక మిత్త్రైక్యయాదు ప్రముక్కడుల కాత్మ చక్షుష్మంతంబైన తావక దివ్యజ్ఞానంబునకుఁ గాక తెగఁజూచువారు నా పలుకలం జేయఁ జూతురే. ఎఱిఁగి యెఱింగి యిట్లనుట కేమనువాఁడ నైనఁ ద్రికాలజ్ఞులు, కాలానుగతి కెదురు చూతు రంతియ గాక మునుపడి తమ కర్తృత్వమున కంగీకరింప రిట్లయ్యు నన్యసాధనోపాయంబుల లోని రిత్తయు వెలివృత్తమునుం బ్రకటింపన చూతురు.

ఐనను బోయి సంధి విషయానుగుణంబుగ సర్వబాంధవ
స్థాన నిరూఢి కర్హముగ సజ్జన మైత్రికిఁ దానకంబుగాఁ
బూని వచింతు దీనఁ బలు పోకలు పోయినఁ గార్య నిశ్చయ
జ్ఞాన విధాన మేరుపడఁగాఁ బ్రవచింపు మనన్ మనస్వియై.

బ్రహ్మనాయండు పెదవిఁగదప నుంకించునెడ బాదనాయండేదు వెఱిఁగి నట్లై.

చెప్పెడి దేమి వారి గుణ శీలము లీవొక కొంతెఱుంగు దా
కొప్పనఁ బ్రాణ గొడ్డములు గోరుడు రీదృశ సంధి; వారెటున్
జొప్పడ నీయ రింతకును శూరులమై పురుషత్వ మేది మా
కొప్పరికించుటే తగని దుగ్ర రణ స్థితి దక్కి వారితో.

సగపాలిచ్చి తమంతవారలుగ విశ్వాసంబుమైఁ జూచినన్
దగవేలేదు సమస్త మాఁచికొని విధ్వంసమ్ము నాశించిరా
ఇఁగఁ బ్రాణంబులు చేతఁ బట్టుకొని నేఁడే యామ్య దిఙ్మండలా
ధ్వగులై రండనికూఁతవట్టి పలుకం దప్పేమియొప్పేయగున్.

గర్వాంధస్థితిఁ గన్న గానక మహా క్రౌర్య స్వభావమ్మునన్
దుర్వార ప్రతి పక్ష శిక్షణకు నుద్యోగించె నాతండనిన్
సర్వానర్థక మూల మంచెఱుఁగడో సర్వంసహా భాగ మా
పూర్వ ద్యూత మిషం గడించుటకు నై పోరాట సంధించెనో.

నాయకురాలి పోకలకు నాయని డాకకుఁ జిక్కి స్రుక్కి మా
కాయము వెంపరెత్తెనని కండలు చియ్యఁ దొఱంగి కయ్యపుం
బాయస మాస చేసె నని పల్లము పోయిన మోముతోడఁ దా
రాయిత పడ్డచో మన కిఁకంతటి పండువు వేఱె యున్నదే

పెఱ సొమ్ము కుడిచి ముడుచుచుఁ
గఱవుం గాలమ్ము నాక కాల్చేసిన నె
ట్లఱుగును బాపము పండినఁ
దఱుఁగును గాకనుచుఁ బల్కఁ దగు నలరాజా !

చేత వాత మంచి చెడ్డ సంప్రాప్తించు
రెంటఁ దెగుటఁ దగిన రీతి గాదు
నోటఁ గాదటంచు నొప్పించుటకు మాఱు
చేతఁగాదటన్న శ్రేయ మనుము.

తల ద్రెస్సి తోఁక బ్రదికెడి
తలఁపునఁ దెగఁజూచునట్టి ధరణీపతికిన్
నిలువెల్లఁ బోటు పుట్టఁగఁ
జెలికాలికి బలప మగుచుఁ జెడితి వటనుమా !

కులమా ! గోత్రమ ! యా యెం
గిలి తొత్తుక నూఁది పట్టి కీడ్పడు టెల్లన్
దల లేని బ్రహ్మ చేసినఁ
బులు దిని మతిమాలి తిరుగు పుంగవమన రే.

అని కటకటంబడి కుబుస మూడ్చిన బలు త్రాఁచు కైవడి
గవద లుబ్బరింప బుస్సు బుస్సున ఛీత్కార మొనర్చుచు.

సిల్లు సూప నడరు సింధురం బటుపోలె
మేర దక్క కొంత దూరమరుచెఁ
గడకు గద్దె గిద్దె గజగజ లాడంగ
దర్ప నిభృత మయ్యెఁ దత్ప్రవృత్తి.

పానుగంటి మహోగ్ర భండన పాండిత్య
ముక్కుబాఁకున వెళ్ల గ్రక్కినట్లు
సవరాల చట్టుపై జగడ మాడిన కోడి
కోలెమ్ము లొక కొన్ని కొఱికి నట్లు
బాహా ప్రవరించిన పంట రెడ్డి కరాళ
కంఠనాళమ్ములు గమిచి నట్లు
పుట్టి మునిచిన వారి పున్కకొప్పెరలోని
మెదడు జుఱ్ఱఁగ సివ మెత్తి నట్లు.

కాలు పెడతల కీలూడఁగా నడంచి
పచ్చ గడ్డలఁ గాల్త్రివ్వి పదరి నట్లు
పూర్వ విక్రమగాథలు పుక్కిలించె
నంతలోఁ గొల్వునం దదీయ ప్రవృత్తి.

భైరవ ఖడ్గంబు నుసులుటయుఁ బ్రతాప స్ఫూర్జితంబులగు సెలవు లూడ్చుటయు మార్గాంగంబై పీఠంబు గొమ్మనన్ వ్రాలి మరగాలిడుట్టయు నందంద యెట్టి సెరల చెలువ మినుమడించుటయు నొక్కపరిఁ దిలకించి కొలువు వింజ మూఁకిడినభంగి విస్తుపోయినది. తత్తచ్చిత్తము లుద్దవిడిం గలంగఁ దత్రత్యు లొండొరు మొగంబు లుపలక్షించు కొనుచుండిరి. ఈలోన మలిదేవుం డుదిలపడి అన్నన్నా! ఇందనుక సాంత్వనంబులఁ బోయినజాడఁగాన నాయని వచనంబులఁ గొంత తెలంగు పడియున్నది. బాదనాదులఁ గడవనాడ నాకయితి గాని పని గాని మంచిచెడు లుపథా శుద్ధు లేర్పఱుప సమర్థు లనుచు నలరాజు దిక్కు మొగంబై.

బావా! మన బంధుత్వము
శ్రీ విభవ యశో విశేష సిద్ధికి నెలవుం
గావింపఁగ దీవింపుము
తావక సంధాన గుణ విధాన సమృద్ధిన్.

శిబికిఁ జేనకు దగినటు
మా వాల్లభ్యంబు చెడక మసలితి మేనిన్
భూవలయ మొక్కఁడా ! కుల
దేవతలకు మెప్పు మాకుఁ దేజ మొసంగున్.

సామ దాన భేద చాతుర్యనిధి వందు
సమయ శుద్ధి విక్రమమున కుద్ది
గాన నేర్పు సూపి కడవఁ బాఱఁగ నీక
పొసఁగఁ బెట్టి రమ్ము పుణ్యపురుష !

వేగి లేచినఁ గన్నుల వ్రేలుచున్న
యన్న ప్రతి బింబమునకు జోహా రొనర్తుఁ
గాని దౌర్భాగ్యురా లాత్మఁ గలఁచి నపుడు
వేఁడి కన్నీటఁ దచ్ఛాయ విస్మరింతు.

తన యెంగిలి పాలానిన
యనుజన్ముల నెత్తి ముద్దు లాడిన నోటన్
వినిహాతి ప్రతిధ్వనించినఁ
జినుకుల నిప్పుకలు పుట్టి చిందుట గాదే.

సందిట గ్రుచ్చి శరీరము
కందిన దని నొచ్చుకొన్న కరములచేతన్
ప్రందింపఁ జూచు నగ్రజు
డెందంబున కిప్పు డింత డెప్పర మయ్యెన్.

అన్నకు గుండె గాలమగు నట్టి చరిత్ర రచించు వార లూఁ
గొన్న మదించి యాఁకె ముని కోపు ధరించె; భవాదృశుండు గా
దన్న సుభిక్షమై నెగడదా ! మన పాలన కింత పుట్టునా
జన్నియ పట్టె రాజెవరు చాలెద రాయమ కడ్డ మాడఁగన్.

ముక్కున వ్రేలు పెట్టుకొని మూర్ఖులు సైతము కేకరించుచున్
బక్కున నవ్వుచుండిరి సభా స్థలి నాబిడ హుంకరించినన్
డొక్కలు పోటు పుట్టినఁ గడుంగడు శాంతి వహించి దానికిన్
జిక్కణమా చికిత్స విరచింపఁగ లేదని లోకు లాడరే.

అనుచుం బ్రేమావిల చిత్తుండై.

కడివెఁడు నశ్రువుల్ దొరఁగఁగా విలపించెడు తమ్ముఁగుఱ్ఱలన్
విడిచిన మేలు గాదనుము వృద్ధుల బాలుర బంధు మిత్రులన్
గెడపిన నొమ్మి రాదనుము కేవల మాస్థకుఁ జొచ్చి క్రూరతన్
జెడు తెఱఁగై నచోఁ దగవు చెప్పుమటంచు వచింపుమచ్చటన్.

కుల నాశ మొక్క నా తల
నిలిచినచో నెట్ట యెదుట నిలుతు భవత్ ఖ
డ్గలతన్ ద్రుంపు మటంచును
బలుకుం దలఁపునకుఁ దెచ్చి పలికితి ననుమా !

యుద్ధము క్షత్ర ధర్మమను నూఱట బంధు జనంబు లేమి గా
శ్రద్ధ వహింప కీకరణి సర్వ వినాశన మాత్మఁ గోరి సం
సిద్ధులుగాఁ దలంచి రిఁకఁ జెప్పెడి వారల గుండె నీఱుగా
బద్ధ ప్రతిజ్ఞు లైరిది సభాపతు లౌదల లూఁచి మెత్తురే.

నేత్ర యుగ్మమందు రాత్రిం దివమ్ములు
పొడవుసూపి నిదురపోవు టుడిగి
నీరసించియున్న నిఖిలాంగకంబుల
కంతు లేని బెడఁద యావహిల్లె.

దురమటంచు గుండె లఱచేత నిడు కొని
బ్రదుకుకంటెఁ గొఱఁతఁ బడుట మేలు
రణ మొనర్చి మెసవు రక్తాన్నమునకంటెఁ
గలియొ గంజొ త్రావి గడపు టురవు.

తమ్ముల దురమందుఁ దలఁగొట్ట నరుగుచు
నాఁడన్నఁ బరులు కొండాడఁ బోవ
రబలచేఁ గీల్బొమ్మలై తిట్టు వడె నన్న
వంగడమ్మున కింక వన్నె రాదు
ఇంత నికృష్టున కెటు తమ్ము లైరన్న
మా పుట్టువున కింత మచ్చ రాదు
సర్వ మాహరించి చాఁ జూచి నాఁడన్న
గంజి కే లోపమ్ము గలుగఁ బోదు.

ఇంత వైభవ మీనాఁటి కేసక మెసఁగఁ
గాడి గట్టంత గటివోక మూఁడు పూవు
లాఱు కాయలు గావించి యల్లురాజు
నిలిపి పోయిన కీర్తితో నెగడఁ గలము.

కావున సంధిపద్ధతి సుఖప్రదమై జన జీవికా శుభం
భావుకమై తనర్చిన నపార విపద్దశ నంది యున్న మా
భావము నొప్పి తీఱుఁ దన బంటుతన మ్మొగిఁ జెల్లివచ్చు తే
కేవిధమైన నొప్పుకొనుటే యుచితంబగు నేమొ భూనరా!

అనినఁ దదనుజుండు పేరలుకం జెంది బొమలు ముడిచి.

ఏమేమీ వినరాని వాక్యములు నేఁడే వింటి మా యన్న నాఁ
డేమో త్రవ్వెద నన్న వాఁడు తుదికాట్టే పౌరుషం బేది సం
గ్రామక్షోభకుఁ గుందుచిత్తమున రంగంబెక్క వాయోడ నే
ధీమంతుండిటు వల్కునే రిపుల ఖద్దిం జించి చెండాడ డే.

మీ దయ మా భాగ్యం బని
పేద తలంపులను నెఱిపి పెంపేదు నెడన్
నాదాటఁ బొడిచి వచ్చిన
దే దారని బుద్ధి సెప్పరే మనకచటన్.

చచ్చిన బ్రదికినఁ బౌరుష
మెచ్చ నడువంగ వలయు నేకడ నైనన్
బొచ్చెము దక్కి చరించినఁ
జిచ్చొడిఁ గట్టించి కుట్ర సేయరె కుమతుల్.

ఈ జాడ దప్పఁ బట్టెడు
భోజన మిఁకఁ బుట్టఁ బోదు పుట్టెడుఁ బో నే
యోజ నెది సంఘటిల్లునొ
తేజము నెఱపంగ వలయుఁ దేఁకువ తోడన్.

ఆనాఁడాడిన మాట లేవొ వినలేదా! కాలముంబుచ్చి రా
నీనాఁ డెప్పటి రీతిఁ బంచెదము సుమ్మీ యన్న వారే కదా
దీనం గ్రొత్త విశేషమేమి మన మర్థిన్ భాగ మిమ్మన్న న
జ్ఞానాంధస్థితిఁబోటుసూపి యెఱుఁగంగాఁబోలుఁ దచ్ఛేషమున్.

ప్రాణి ద్యూత మనర్థదాయకము గా భావించి తన్మాయకున్
లోనై సర్వము నోడి తుట్టతుది 'కల్లో రామచంద్రా' యటం
చీనైచ్యంబున కోపి వచ్చితిమి నేఁడే తెల్ల మయ్యెన్ దదీ
యానూన ప్రతిభా విశేషములు ధైర్యస్థైర్యముల్ చాలవో.

మధుర జ్యారవ మెప్పుడీ శ్రవణ సమ్మానంబు గావించునో
పృథు దోః పాటవ మెన్నఁ డారిపు నురః పీఠం బధిష్ఠించునో
శిథిలప్రాభవ మెట్టు లగ్రజు భుజాసీన స్థితిం జెందునో
వ్యథ నా కెవ్విధిఁ బాయునో యనుచు రంధ్రాన్వేషినై వేచితిన్.

బ్రతికినం బల్లె నాట మర్త్యాభవమ్ము
చదిసినం గోరిమిట్టల శాసనములు
స్థిరములై తీరుఁ బౌరుషోద్రేక కలన
దక్కఁ రాణింతురే క్షత్త్ర ధర్మపరులు.

జన్మ మెత్తిన ప్రతి జీవి చాక తప్ప
దైనఁ బౌరుష మఱి వెనుకాడ నేల
పౌరువు లాసించు బ్రదు కేండ్లు పూండ్లకంటె
ఘనత దీపించు బ్రదు కొక్క గడియ చాలు.

పర ధనము కొల్ల వెట్టి సంప త్సమృద్ధి
నెసఁగు చున్నాఁ డితరుల వాయెత్త నీక
తిన్న దఱుఁగదు మాఱొక్కనకున్న నింత
తెలియ రా దూఁచ కోఁతకుఁ బిలువ కున్న..

ఆణి మెఱుంగు ముత్యాల శాలలలోన
నధివసింపఁగ దాని యబ్బ సొమ్మె
పలనాటి భాండారములఁ బాలు వెట్టించి
పొరిదిఁ బంచఁగ దాని సొంత ముల్లె
మన్నె భూముల మంచి మడి మాన్యముల నేర్చి
దాన మీయఁగ దాని తాత సొత్తె
సంపదాలయ మెక్కి సాచివ్య మనుపేర
గడియింప దాని యిల్లడ ధనంబె.

రూకc బోcకగc జూపి మార్మోcగుచున్న
దాని కింతటి కాళ్లు భూధవుcడు దెచ్చె
గ్రొచ్చి పాతెద నాగుల గుండ మందుc
జిత్ర వధ సల్ప రాజు వీక్షించుచుండ.

సరిగా నచ్చిక లాడి పంచిన సరే సంతోష మాతంక మె
వ్వరు పెట్టం గమకింత్రు వారలను మద్బాహు ప్రతాపా నల
స్ఫుర దభ్రంకష కీల కింధనము గాc జొప్పింతు లే దేని నె
త్తురు జల్లీ టెలc గ్రుమ్మి ప్రాణములతో దోసింటc ద్రావించెదన్.

పూcచి పట్టి యెత్తి పోలు పేది రనకుండ
నూcచ కోcతc గోయు టొప్పిదంబు
రాచ పుటుక పుట్టి రణరంగమున నోడి
పాఱి చనుట ధర్మ బాహిరంబు.

స్వర్ణయుగము నాcటి స్వచ్ఛంద జీవుల
చరిత లెత్తి మనము చదువ లేదె
వీరమరణ మన్న విశ్వసింపక యిట్టు
లోహటించి నార లుక్కు దక్కు.

కావున నీమతిభ్రమణంబునc బుయిలోడి తిరిసి బ్రతుకుట
లగ్గని వాయోడి పలుకుట కేమనువాcడ. వినువారి చెవుల
కించె నేమో గాని కాకాక్షి న్యాయంబున వర్తించు
వారిలో ననుc గట్టి విడువకుcడు. మఱియు నాcడచ్చటc

బుట్టిన విశేషంబు లుగ్గడించెడివే. ఆ జగజంత నేఁడెట్టి యెబ్బెట్టులకు దారిదీసెనో యెఱిఁగి యుండె యెఱుఁగమి యుండె మయిమై నున్నవారు. మొనమొన్ననే దండెకవిల లెత్తించి సరిదాకకున్నను దోడ్తో భూభాగంబెల్ల నైదు మళ్లుగా విభజించి మాచర్ల సీమం దొట్టి తంగెడు సీమ దనుక నెల్ల లేర్పఱిచె. అంతం బోక లోఁగడ లంక నాదులకైన సభ్యతా పరాభవంబున కనుగుణముగా దేశముఖ దేశపాండ్యాలగు బుగ్గరాజ దుగ్గిరాజాదులఁ బద భ్రష్టులఁ జేయ విశ్వ ప్రయత్నమ్మొనర్చె. రాజానుమతిం జేవ గల మన్నీల వశవర్తులం బొనర్చుకొని బహు సంఖ్యాకుల నోరు గట్టి కృతకృత్యురాలైన దని కర్ణాకర్ణికగాఁ గూయి వచ్చినది.

అనవిని బుగ్గరాజు విషయాంతర భూములు చీల్చి నాయనిం
జెనకుట కుగ్గపట్టి ఫలసిద్ధికిఁ బక్షజయాభివృద్ధికిన్
జనపద మోహ పద్ధతికి శత్రు నిబర్హణ కార్యసిద్ధికిన్
అనువగు చట్టమంచు నృపునాజ్ఞగ నాగమచాటెఁగొల్వెనన్.

దాని కనువగు మందబుద్ధు లీకొనిరి. ఆపై మమ్మామంత్రణ చేసి వలసిన ట్లానపెట్టినది. దాన నిపు డేమి యయ్యెడు. బాలమర్దేవులు సమయంబు నడపి మీరన్న మేరకు విడిసిరి. అంత వలసిన మీమీ దాయములు తెగినపిమ్మట

నీ పనుపు చేయువార . మిది పెద్దైన సంగతి. తగు కొలందులం దెగడిది గాదు. నేఁటికిఁ బనివిందు మని వలను గల వా రుగ్గడించు నెడ నలగాముం డలఘు బుద్ధిమైఁ బల్లెత్త కూరకుండె. తక్కటి వా రీయోజ నను సంధించి కెళవు పట్టులం జేరి మంతనం బుండిరి. అంత నన్నుం బోని వారొండొరు గడవ నాడుకొని తత్త న్నివాసంబులకుం జనిరి. నారాకకును గతం బిద్దియే యనియు మండల విభాగ చరిత్రం బుగ్గడించుట కిది యదను గాదనియు రాయబారము సక్రమంబుగా నడచిన మీఁదట నిరువాఁగుల చిత్తవృత్తు లెఱిఁగి తగురీతి వాక్రుత్తు నని తన్నుపలక్షించు నలరాజు నెక్కుఁ బొడిచె నంత నతండు.

ప్రాణ గొడ్డమ్ములకుఁ దెగఁబడిన దగర
యెంత లేసి నికృష్టము లేనిఁజేయు
దూదికచ్చని మూఁపున దుంగ లెత్తు
మగలకు మగండు గాని సామాన్యగాదు.

ఎత్తునఁ ద్రోసి రాజనుట కెత్తి దురుత్తర వాద ఖండనో
ద్వృత్తిఁ బొంకాలు మంటకది వీఱిడిగాదు శమ ప్రధాన వా
గ్వృత్తము పైకిఁ జాటు చపవిత్రమనఃస్థితిమై మొఱంగుచున్
గత్తులు దూయఁ జూచినది కావరు లింత గ్రహింప నేర్తురే.

మె_త్తని పులి క_త్తులతోఁ
బె_త్తనముం జేయు దాని పెడతల నడికీ
ల్లొ_త్తినఁ గాక నృపాలుఁడు
చి_త్తమ్మునఁ దేరి సంధి చేయునె తలఁపన్.

మాటలు పెక్కు లేల కసుమాలపు గట్టుపకాసు లెల్ల దు
ర్నాటక మాడుచున్న వినరాని నికృష్టము లాడుచున్న మో
మోటమి దక్కి దాని కతఁ డూకొను నేఁ దుదిఁదీఱు మాటలన్
జాటెద రెండు పక్షముల సార మసార మనింద్య ధోరణిన్.

ఇంతకు నంతరం బెఱింగి పల్కిన మీ వచనంబు లూఁతగా
యాథార్థ్యం బూఁది నెయ్యంబు వాటించి బాంధవ్యమున
కైన భంగి నాడుడు. వారిది గైకోక బెడిదంబులకు
గురియైన నా మీఁద దైవంబ యెఱుంగు నిది యిట్లుండె.

పరులకు నైన మీరు గుణ పాఠము నేర్పిన వార లౌదు రీ
మొఱకులఁ జక్కడంచియిఁక ముందుమ తెన్న టికిట్టినైచ్యముల్
జరుగవు బావ మానసము శాంతికి దాంతికి మూల కందమై
కరఁగిన లాభ మేమి త్రిజగమ్ములు మెచ్చిన వారు మెత్తురే.

వైరము మానుమంచు గుణవంతుఁడు శాంతనవుండు పల్కినన్
నీఱగు వంశ మెందుకని నీతివిదుండు గురుండు సెప్పినన్
గౌరవనాథుఁ డూకొనఁక కాంతు దొలంగక పాండు పుత్రులన్
ఘోరికిఁ జీరి కట్టుకొని పోయిన దేమొ యెఱుంగ కుందురే.

అగ్గికి గాలి తోడయిన యట్టుల నాయకురాలు రాజుకుం బెగ్గడయై దురంతములు పెక్కొనరించుచు నున్న దింతటన్ బుగ్గయి పోవుఁ గాని మన పూర్వుల వంశ యశమ్ము లింక రాఁ దగ్గ ప్రతిష్ఠ లేదొక విధమ్ముగఁ జొప్పడు నేని నిందవహా.

ఎట్లైనఁ దెగిన పుంతకు వెనుకాడ నేల ? చచ్చిన స్వారాజ్య సుఖము – చాకున్న స్వారాజ్య భోగం బనుభవింతము. కృతబుద్ధు లాత్మ సంయమమున కోపి యసిధారా వ్రతం బూని దేహత్యాగం బొనర్చి యుభయ లోక తార కంబును నిర్వృతి కారకంబును నగు శుభస్థితిం బొందుదు రని పెద్ద లాడుదురు. అయిన నీసంధి యాచార మాత్రోపక్రమముగా నడపి వత్తు. అచ్చటి వెంబరవిత్తు లొక వెంట కొడంబడక పెడ దిరుగు టెట్లును దప్పదు. దానం జేసి నావచ్చు నంతకు మీమీ యుద్ధోపకరణంబు లలవరించు కొని సంసిద్ధులరై యుండు నది. నాగులేటి రేవుల నల్లలొట్టొడ్డు కాల మాసన్నం బైనది. పలనాడు వీర రక్త రంజితమై దిగ్వ్యూహము లుపరంజించును. తదీయ చ్ఛాయలు వీరరస విస్ఫూర్జితంబులై విశ్వశాంతి కాకరంబులై ప్రగతికి మూలకందము లగుఁ గాత.

కావునఁ బోయివత్తు మన కారణ జన్ముని బ్రహ్మనాయ నా జ్ఞా వశ వర్తినై పనులు గైకొను వాఁడను వారు వీరొకే రేవునఁ ద్రావఁ జూతుఁ గికురించి పరాభవ మాత్మ నెంచినన్ దైవమునెత్తికోలు తుది దాఁకుట వాస్తవ మయ్య భూవరా!

అని మలిదేవుం దిలకించి.

ఆము దిన్న వార లనుకొంటివో మమ్ము
మొగము గంటు వెట్టి దిగులు పడెదు
బొమ్మగట్టి యాడఁ బోయెదు దుఃఖాంత
నాటకమ్మునకును నాంది వీవు.

అర్ధరాజ్య భాగ మనుభవింపఁగఁ జూచు
మీకు లేని దుగ్ధ మా కదేల
గోతఁ బడుట మేము కుడుచు టేమో మీర
లెందు కోయి బావ సందియంబు.

అనిన మలిదేవుం డెలుంగు రాలు పడ దైన్యంబు గదురఁ
నిట్లనియె.

తండ్రి కడచన్నదాది విద్యావివేక
బుద్ధులం గొఱవడనీక ప్రోచి తుదికిఁ
గీడ్పడఁగ మమ్ముఁ జిచ్చుఁజికింప నేల
అతి సుఖాస్పదమందు సత్యాగ్రహంబు.

పక్షులను నింగిఁ బాలించు ప్రభువు గలఁడు
చీమలం బుట్టలోఁ సాకు స్వామి గలఁడు
కప్పలను రాతిలోఁ బెంచు ఘనుఁడు గలఁడు
పౌరుషం బేల యందు నీ భాగ్యమునకు.

తాతలు తండ్రులు మనుమలు
భ్రాతలు బంధువులు గూలి పావుకొనెడి దే
దో తెల్పుఁడయ్య రాజ్య
శ్రీ తృప్తిం గొలుప దట్టి సిరు లేలందున్.

ఒక్క గర్భాన నైదుగు రూడి పడిరి
పాళ్ళకై తెగి తుది భంగపడి రటంచు
లోకు లాడఁగ నేల! యాలోభి యొకఁడె
యేలుఁ గాకందు సర్వమహీతలంబు.

నాగులేటొడ్డు గుండాల వాఁగులోన
నల్లలొజ్జొడ్డి గాజులు గుల్ల లెనసి
పసుపు గుంకుమ తెట్టలు వాఱ నేల
నిత్య కళ్యాణముగ నాట నెగడుఁడందు.

సహగమన కీలి కీలాగ్ర సంప్రభూత
ధూమ ధూపిత దిక్తట స్తోమ మద్రువఁ
గెరలి యాడెడు నటరాజ ఖేలనమ్ము
నాత్మఁ దలపోయుఁ డందుఁ బ్రత్యక్షముగను.

పోటు మన్నీల కుఱు మాపు పునుక లోలిఁ
గఱచి చెఱలాడుచు నక్క లఱచుచెల్ల
గుండెల న్మాఱు మ్రోఁగి నటుంచు నెప్పుడు
వలదుడుగుఁ డందు బీభత్స వైభవంబు.

పసిఁడి పండిన పలనాటి భాగ్యసీమ
నెత్తు రొట్టోడ్డి చౌడెక్క నీరసించి
గచ్చ పొదలకు నెలవు గాఁగలదు గాన
సఖ్యపడుఁ డందుఁ గష్టనష్టము లెఱింగి.

ఇంత యెందు కంటేని.

అంతర్దృష్టికి బాహిర
మంతయుఁ దృణకల్ప మది మహాత్ముఁ డెఱుంగున్
చింతా జడ దృష్టికి బా
హ్యాంతరములు లేక తృష్ణకై మల్లాడున్.

నీ వన్న యర్థ మాత్మల
భావింపక పోము రాచపాడికి గుఱియై
జీవములు వాసి రెందఱొ
దేవ నిభుల్ ప్రభువు లద్రి ధీరుల్ వీరుల్.

కోపము పాపము పెంచును
బాపమ్మున నిహ పరములు పాడఱు నీలోఁ
జేపడు ననర్థకమ్ములు
మోపై నెంజిలి ఘటించు ముప్పొడఁ గూర్చున్.

అనద లహర్నిశ మేహో
పెనకువులం జొత్తు రాత్రి పెంపునఁ దుదికిన్
బని చెడి తముఁ దా రెఱుఁగక
తునిసెద రెటువంటి కార్య దోహలినైనన్.

ఈ బొమ్మల కుంపటితో
నేర్రైనం గూర్కినారలే సుఖముగ సం
సారికిఁ జన దెప్పట్టునఁ
దీఅని తృష్ణ న్నలంగి తేఁకువ సెడఁగన్.

మన పూర్వుల్ చరితార్థులై చనిరె సామ్రాజ్యాధికారోన్నతిన్
జనుచో సర్వము నెత్తి గట్టుకొని స్వచ్ఛంద స్థితిం బోయిరే
జనవంద్యుల్ దిగధీశ సామ్యులు హరిశ్చంద్రాది భూపాలకుల్
మనిరే జేపిట నిల్వ నేర్తుమె నృపాలా సుంత యోజింపవే..

రాజ్య ప్రాప్తి వినాశ హేతుకము తద్రక్షార్థమై సౌఖ్య సం
త్యాజ్యంబై పలుగండముల్ వడసి సంతాపాగ్ని కుండమ్మునం
దాజ్యంబై పొలుపేది చీఁకు బలెఁ జింతాక్రాంతుఁడై కుందఁడా
"రాజ్యాంతే నరకం ధ్రువ"మ్మనుచు నార్యవ్రాత మెగ్గాడదే.

అంతముగాన రాని చతురబ్ధి పరీత మహీతలమ్ము ది
గ్దంతు లటుల్ వహించిన జగత్పతు లర్థము లాస సేయరే
యింత నికృష్ట వృత్తిఁజనిరే చనిరేని సుఖమ్మొ వారికిన్
బంతులు దిద్ది చెప్పెదను బాపము దక్క మఱొండు గల్గునా!

ఇంతకు సర్వ సన్న్యాసం బుత్తమోత్తంబని తోఁచెడి ఇప్పట్ల
శాంతి సమరమ్మున కీ కొన్ని నిరువాఁగుల కెంత
యొప్పెడిని భవిష్యదర్థంబులకు గ్రుక్కిళ్ళు మ్రింగి తెఱంగు
మాలి యఱవాయి గొనుటకంటెఁ బిఱితివక వాడి సూపు

యెంతయు మగతనంబైనను రాచపాడికి నెలియైన నన్ను మన్నింపఁ గోరెద. భవితవ్య మెట్లుండె నట్లయ్యెడు. నా మున్నాడిన పరుసంబు లేవే సర్వవాద మాత్రంబులుగాఁ బరిగణింపుఁడు. మా యోగ క్షేమంబు లాదలఁదాల్చి బ్రహ్మనాయని కార్య గౌరవంబున కలంతి చూపులేదు గానఁ దమ్ముఁగడవ నాడ నోడెదను. ఐనఁ దమ్ము నూఁది పట్టి ధర్మయుద్ధమునకుఁ గడంగుఁడు. మఱియు,

తాటస్థ్య మూని నాకగు
వాటము సర్వంబు బంధు వర్గము దానున్
నేఁటికిఁ గా దిఁక మును బా
హాటముగా ననుభవింపు మనుము నృపాలా!

కాని నా మనసాక రీతి గాదు తొల్లి
తమ్ముఁ గుట్టునికై సంధి తగు నటంటి
నన్న ముకు ద్రాటఁ గాల్ద్రివ్వచున్నఁ జూచి
పోరి కలవాయి గొంటి నాపోవకునికి.

పోయి రమ్ము బ్రహ్మనాయని పంపున
నింతవట్టు నా హృదంతరమ్ము
సకల బంధుమిత్ర సామంత నరపాల
మంత్రి సంతతికి నమస్సు లనుము.

నేనై కౌఁగిట గ్రుచ్చును
దీనుండై వేఁడె నను ము దీనన్ మా కిం
తైనన్ లాభము లేదను
మానాఁడే విడచి నారమను మఖిలమ్మున్.

ఏని కాతండు రజ్జు లాడిన నాపలికెడి దేమి కలదు. ఇమ్మహాత్మ్ముని మున్నిడుకొని తాఁ జెప్పిన చొప్పున నడచు వార మని సమాధాన సమేతుండై యుండె నంత సురేన్ద్రుఁడు మల్లిదేవు నవలోకించి.

ఓ నిటు లాడు టెంతో వినయాదిక సత్య వచః ప్రవృత్తికిన్
స్థానము కాని నీవనిన చక్కటులన్ జెవి గొట్టి చెప్పినన్
మానఁడు దుర్ణయంబు లభిమాన ధనుం డతఁ డర్థిఁ గోరి స
మ్మానము సేయువారు కొఱమాలిన దయ్యము లియ్యకొందురే.

తమ్ముఁడు వల్కి నట్టి రణ ధర్మము దుర్ణయ చిత్త వృత్తులన్
బొమ్మలఁ గ్రుమ్మి చేఁదిగిచి బోల్మడఁ గట్టిన భంగి నున్నదీ
యమ్ముడు మాట లేల విజయార్థులమై మన కోపినట్ల ఘా
తమ్మున గ్రుచ్చి పాతినఁ గదా! తుదిఁ దేలు యథార్థమెట్టిదో.

అని వెండియు,

మీ కొఱకింత కస్తి పడి మిన్నక యెండకు వానకోర్చి పే
రాఁకటఁ గుంది తుట్టతుది కర్థము చేపడు వేళ కార్తులై
డీకొన రేని వారటమటింపరె లోకులు ప్రవ్వ తిట్టినన్
జీఁకటి మోములం దరలి సిగ్గఱి పోయెద రే భవాదృశుల్.

అనిన మల్లుదేవుఁ డజ్ఞత్తి కానిండు
ఒఱల వెలికిఁ గత్తు లుఱుకుచుండెఁ
గాల పక్వ మరసి కాఁబోలు బాహాస్ఫ
ళించుచుండి రిచటి పంచజనులు.

మల్లుఁ డిట్లు పలికి మానవమాద్ర వహింపఁ
గలఁత దక్కి కొల్వు తెలివి సేర
బ్రహ్మనాయఁ డంత భాషించె సభవారి
శ్రోత్రపుటము లమృత పాత్రములుగ.

మల్లిదేవ భువన మాన్యులు మీవార
లింద్ర వైభవముల నెసక మెసఁగి
రాప్రశస్త చరిత కావంత మచ్చ ఘ
టిల్ల నీక చూతు మెల్ల యెడల.

మిమ్ము గోత దింపి మే మొడ్డు పట్టము
కుల వినాశనమ్ము గోర మెప్డు
డలుగురాజు బిడ్డ లల్లరి పాలైన
నుచిత ముగ్గడింపకుండ లేము.

గ్రాస వాసములకుఁ గస్తి గూరిన రాచ
పుట్టువునకు నెగ్గు పుట్టఁ గలదు
తమ్ముఁ డా రెజెంగి తనుపు టధర్మంబు
పరుల పనుపు సేఁత పాడి గాదు.

తండ్రి గొంకరాజు తనయ కర్పించిన
పల్లెనాటి కీ విభాగమేల ?
ఆమె కొడుకు దక్క నన్యు లీ రాజ్యమం
దడుగు మోపఁ గూడ దండ్రు నిజమె.

బాదనాది యోధ పరివేష్టితుండయి
పల్లెనాడు ప్రభువు నొల్ల గొనఁడె
తద్భుజార్జిత ప్రధానాంశమున కాస
చేయ వల దటంచుఁ జెప్పు టుఱవు.

ఇమ్మహార్థ మాత్మ నెంచి బాదన్నను
దత్తు వడసె నల్గు ధరణి విభుఁడు
తండ్రి సామరస్య తాత్పర్యమునఁ జేసి
సిలుగు లిట్టి వెల్లఁ జెల్లి వచ్చె.

పెద్ద త్రవ్వకందుఁ బీస పా లడిగినఁ
గుమతి కరణి నీళ్ళు నమల నేల
దగర మాట కడుగు దాఁటని తన యేలు
బడికి దోసి లొగ్గి బ్రదుకు టరిది.

సామోపాయంబున న
గ్గామిడి దేరండు చేఁదు గల వా రచటన్
దీమసములు వలుకుదు రా
తామసుఁడు గ్రహింపఁ దలఁచి దప్పిన నగునే.

ఏడబ్దంబులు కాళులు
గాఁడిన మాఁడిన గణింపకయె తిరిగితి మా
నాఁడేమంటివి రాజా!
నీడల నెవ్వారు గడవ నేరుతు రనవే.

కనువారెల్లరు పాపకృత్యమని వక్కాణింప దుమ్మొత్తి పో
సిన నాసాసలఁ గ్రుంకు నాఁడు ప్రవహించెం జెన్న దేవాలయా
గ్ర నిబద్ధ స్ఫటికాశ్మ సంతతులపైఁ గన్నీరు మున్నీరు గా
జననాథా! గుఱుతున్నవా! మన ప్రతిజ్ఞల్ నాఁటిఘట్టమ్ములున్.

తాతల్ తండ్రులు శత్రుజీవనమె క్షాత్రస్ఫూర్తి కుద్దీప్తి గాఁ
జేతో మోదము గొల్పినారు తుదికిశ్రీ నిత్యమై దాన సం
ప్రీతిం బొందెదమందుమా యశముపృథ్విన్ నిల్వ నందంద దు
ర్నీతి చ్ఛేదన మాచరించి మఱి సందీపించు టొప్పం జుమీ!

ఈఱతాఱలఁ గయ్యంపు టెత్తు లెత్తి
పట్టఁ బగ్గాలు లేకుండ బైసిమాలి
యఱవఱలు సేయఁ జూచు దురాత్మకులకు
సంధికార్య మదెట్లు పొసంగు నయ్య.

నీవనినట్లు వారొక వినీతికిఁ జొచ్చిన నుత్తమాంశముల్
దేవురు గొట్టు లెట్లనుమతించెద రౌనని యూరకున్నచోఁ
శైవ దొఱంగె నంద్రు కలుషించిన మోఱకులందు రింత కా
త్రోవలు దుర్గమంబులని తోఁచు నెటుల్ గమియింతు రార్తులై.

పావలు ముట్టి వచించిన
దైవంబని పూజసేయఁ దనియుచె తుదికిన్
గావరుఁడై చెడఁ దలఁచెను
భూవర వేదాంతమచటఁ బొసఁగదు సుమ్మా !

అను నంతలో,

బాదనాయఁడు భ్రాతృ సంభాషణమున
కడ్డువడి క్రొంతవడి ప్రావృడభ్ర జనిత
ఘుంఘుమారంభ గంభీర ఘోషణములఁ
గనలి వచియించె గుండెలు గాఁడి వాఱ.

చెల్లెంబో మన రాచబిడ్డనికి వాసిం గూర్చు చక్కట్లు మీ
రెల్లన్ ఫుల్ల ముఖాబ్జులై వినుట కెంతే నొత్తుఁ జిత్తంబులో
'కల్లో జోగ'ని యూళ్లు లెత్తుకొను చజ్ఞానాంధకారమ్మునన్
ముల్లె న్మాటను జంకఁ బెట్టుకొని నాము ల్వాటి పోనుంటిరా !

మనమిట్లైన సమర్థ లేమయిరి సన్మార్గ ప్రచారంబునన్
జనసే వారల బుద్ధి రాజునకు నిచ్ఛామాత్ర సంస్పృష్టియే
యనుకూలంబని తోఁచె నేమొ వినువా ర్వార్త ప్రసంగంబు గా
దన రాముందిసినారలో హృదయజాడ్యం బార్తిచేకూర్చెనో!

జననాథుం డసకృ ద్విచారపరుఁడై సౌజన్యముం జూపకే
కనుపుం గొట్టఁ దలంపగా నబలయున్ గాల్దువ్వి కవ్వింపఁగా
వినుమీ వీనులు ప్రయ్యకున్న విది పృథ్విన్ రాజధర్మంబు గా
దని నా చెప్పెదు మందబుద్ధులకుఁ గార్యప్రజ్ఞ లేదందునా !

అవలం గత్తుల నుత్తరించుటకు రా నగ్రాసనం బిచ్చి వా
చవులం దేర్చెడువార లుండెదరె సాక్షాత్త్వాళియై నాయురా
ల్పవరంబందున నిప్పుకల్ వెడలఁ గ్రావంజూచి చల్లార్ప సం
భవమా ! భావి పరిస్థితుల్ విషమమై ప్రాపించు నిట్లాడినన్.

రాజన్యాంతము వీరభోజ్యము మహారాజ్యంబు కీడ్పడ్డ నే
యోజన్ రాజు సహించు నే క్రియసముద్యోగించు నేచాడ్పునన్
యోజించున్ వినుమీనమేషములనిట్లూహించునానైచ్యముల్
తేజస్వాంతులు సైఁతు రా మనవలెన్ దిగ్భ్రాంతులై పంతురా!

పెట్టకూఁత పుంజు నెట్టన బరిద్రొక్కి
'జుములు' చేయకున్నఁ జమరి పోవుఁ
గాన మున్న మనము ఖడ్గవాదమ్మున
నెదిరి దంగఁ గొట్టు టెంతొ సుళువు.

చేవకొఱకు ముసిఁడి చీఁకిన చందాన
రాజ్యమునకు రిత్త వ్యాజ్యమేల
రెంట మూఁటఁ దెగిన తీపైన మనవాలు
కోలుకొందు రింత గొడవయేల.

వలస పోవ కున్న వాల్లభ్యమును డించి
నాఁడె తీఱు వారి కోడిగములు
కుడిచి గచ్చకాయ కుమ్మరావమునయం
దిడిన భంగి ప్రకృత ముద్దుగునెడల.

సమయమ్ము వెట్టినా రా
క్రమ మణుమాత్రమ్ము తప్పకయ వచ్చితిమే
తమ యిచ్ఛ వచ్చినట్టుల
సమభాగం బిచ్చి మనుప జాప్యం బేలా !

ఇంతకుం దక్కరేని తెగి బంట్లమై యఱుముట వాస్తవంబు. కార్యము కడచన్న మీఁదటఁ దలలువట్టి చూచుకొన్నను లాభము లేదు. ఈ గద్దరింపుతీరు కోడిగములు గాఁ గైకొన్నను వారి కగ్గిలో గుగ్గిలము చందంబున నయ్యెడు మనుఁడు మలిదేవుండు భద్రా ! ఈ యయ్యె యోపి నట్లు చేయుట కాన వెట్టి బొమ్మ గట్టి నిలిచితిమి. దీనికై వలవని యాగ్రహం బేలని సాంత్వనంబు లాడునెడ గండు కన్నమనీఁడు మన్నీల బిరుదు లాడి కార్యావసరంబు కనుసన్నల నిరూపించుచుఁ దదంతర్గతంబు లరసి సమయ శుద్ధికై వేచియుండుఁ డనఁగా బాలచంద్రుం డుదగ్రుండై,

చన్న దదేమొ చన్నదిఁక జాగొనరింపక పోయి కొల్వులోఁ
బిన్నలు పెద్ద లందఱు విభీతిఁ గలంగెడు భంగి నాఁపఱా
సున్నపుఁ బట్లు తప్పవని స్రుక్కిన వెక్కిన ప్రొక్కినిల్చినన్
వెన్నులు చక్కనౌనని సవిస్తరతం దగ నాడు ముద్ధతిన్.

పల్లటి గొట్టి నా తగరు పైకొని యా నలగొండ చట్టుపై
గల్లున దూఁకునాఁడు మొనగాఁడు పతాలుఁడు చిందునెత్తురుల్
వెల్లువ గట్టునాఁడు పరవీర భయంకరుఁ డమ్మరాజు చే
బల్లము పట్టునాఁడు తలపట్లగు నంచు వచింపు మచ్చటన్.

నాముల గండి గుండమున నాయకురాలిని గ్రొచ్చి పాతెదన్
దామసమూర్తియైన నృపు దంచన గుండున వ్రక్కలించెదన్
గామిడియైన సర్వనృపకాండము గుండెలు గుమ్మరించెదన్
స్వామికిఁ బ్రీతి సేసెదను సర్వమహీతల పట్ట భద్రతన్.

చెప్పుటెగాదు చెప్పినది చేసియె తీరుదు వారు వీరు వా
తప్పునఁ బోయిరేని రణధర్మమె తీరిచి దిద్దుఁగాక మా
చెప్పెడి దేమి నీవ పరిశీలన చేయుము రెండు పక్షముల్
దెప్పరమైన యిప్పటికె తేఁకువ మాలిన సంధియత్నముల్.

దీనంజేసి మనము గొట్టు మిట్టాడిన వారు తోఁక త్రొక్కిన త్రాఁచుల కైవడి మిన్నుమన్ను గలిపి బాహాప్పళింపఁ జూతురు. మన మోఁకాలితండ కాబిడె దయా దాక్షిణ్యములు సూపదు. ఇంతదెలిసియు మీరదయ మాభాగ్యంబని బద్ధాంజలులై వేఁడికో లుచితంబు గాదు. అదియుంగాక,

పడబ్బంబుల బ్రొద్దు మీ కనులలోనే కాఁపురంబున్న దీ
నాఁడైనన్ సుఖనిద్ర చొప్పడదు నిందాభాజనం బూని ప
ల్నాఁడో క్కుమ్మడి బిచ్చ మెత్తుదుమె చెల్లంబోదు మావారికీ
జాడన్ దైన్యము హైన్యమింకఁదమదాస్యమ్మోర్చి పైరింతుమా!

ఇంతటనైనఁ బరిభవానలంబు దరికొనకుండఁ జూఁచి పట్టి వచ్చెదు పోటు మన్నీలకుఁ జేలావు మెఱయఁ గయ్యంబున, కైత్తక యొఱకటంబుల నొడ్డారింపక యొకమొల్పున

సంబాళించు టెంతయుఁ దగిన పని. నాతోఁ జెన్నట్లు బెడి దంపు టడిదంబులఁ గాని కార్య గౌరవంబు [redacted] నట్లున్నది. భవితవ్యము బలవత్తరమైనది గాన వల్లమా లిన పరుసంబు లాత్మ శ్లాఘా పాత్రంబులై కొండొక కాలంబునకు విషమించుట నైజంబు. తమ్ముఁగుఱ్ఱల నిట్లు వఱపి నీచవృత్తంబుల కోపి యిరువాఁగు లార్తిఁగూరఁ దీయని నోరఁ జేఁదు మేయం గమకించు నలగాము నేమన నేర్తు. తా మన్నించు ప్రాజ్ఞలోకం బింత తగవు మాలి యుండునే. కొఱవి చూఁడిన మూఢ్ధి నాగసాని కాఁకెక్కి- చిఱ్ఱు ముఱ్ఱాడుటకుఁ దన తాత తండ్రుల కాణాచి వీసర వోవుచేమో యెఱుంగ. ఆబాల గోపాల మొక దూఱు వెట్టినఁ గైకొనని ముక్కడు లెంతకుఁ దెగరు. వారి కొక నీతి నియమంబులు గలవే. చెప్పెడివా రూఁకొను వా రర్థోపజీవు లగుటం జేసి వారి నూఁది పట్టిన జేఁదు చేసేతఁ గొఱవి పట్టి తలఁగోఁకి కొనుచున్నవాఁడు. ఏదెట్లైన నయ్యేడు.

మా యయ్య ముట్టి పలికిన
ప్రాయోవాదమ్ము సర్వపక్ష హితశ్రీ
శ్రేయో దాయక మగు నిది
దాయల కానందరస నిదానమ గాదే.

దీనికి మూఁదలయై కుంచ వట్టునది నాగసానిగదా! సర్వకుల క్షయంబునకుఁ బాదై రాజు పావుకొను. నదేమో

చూఁచెద నాపె దగరతనం బెట్లు చెల్లునో మీ రెఱుంగ కుందురా! కానిండు యథాలాభంబున కోపి యగ్గలికమై పోలికలనుం జొచ్చి పాపం బొండె పుణ్యం బొండె సాధింత మిద్యోడ వాచాదోషం బేల యని ప్రకృతిస్థుం డయ్యెను. అంతఁ గొలువు వారు,

ఔనిది యెంత యొప్పునని యాడిరి బాలుఁడు చెప్పి నంతయున్
మానక చేయువాఁ డనిరి మన్నన లేని మనుష్యు లింతకున్
బూన రిటాడ నేలనిరి పుణ్య ధనుండగు బ్రహ్మనాయఁ డి
ట్లానతి పెట్టఁ గాఁ బొసఁగ దా! యని మైమయిఁబోయి రెల్లరున్.

దానికిఁ దల లూఁచిరి భూ
జానులు జయ వెట్టి రచటి జనములు వరుసన్
గానుక గాఁ బువుబెత్తులు
మానికపుం గుండలములు మఱఁదు లిడంగన్.

వాని నలరాజు గై సేసి మేనమామ
బావ యగు భర్తయగునని పరిహసింప
మల్లుదేవుఁడు నగుమోము మలపు కొనుచు
వరుస పచరించె నతనితో సరస ఫణితి.

ఏతద్వృత్తాంతము విని
చేతోమోదంబు దక్కి చెల్లాంబికయున్
గాతర మతియై కొల్వున
కేతెంచెన్ బ్రహ్మనాయఁ డెదురుగఁ జనియెన్.

చని యాలింగితుఁడై కొ
ల్వూనఁ దెర మోవంగ నిల్చి పుణ్యాత్మకులా
తనయులఁ గన్న మహాత్ముల
కెనయే నాతల్లి తెల్పవే పనులన్నన్.

చెల్లాంబిక నాయనిం దిగిచి పట్టి.

నీ తాల్మికతన సర్వము
భూతల మానంద రస విభూతికి నెలవై
భూత ప్రీతి ఘటిల్లు వి
ధాతృ కృతంబింత యనుచుఁ దలఁచితిఁ దండ్రీ!

తాత తండ్రుల చెయ్దముల్ దలఁప రైరి
యుగ్గ పట్టిరి తెగుటకై యుభయు లుఱకఁ
బిల్లి పట్టిన యీరువు పెద్ద చేసి
కడకుఁ దెచ్చిరి పచ్చని కాఁపురంబు.

వారు వీరెత్తి పుడమికై పోరు చుండ
నడుమ మా బోంట్లు కనరాని బెడఁద గలుగు
నల్లుకుట్టున కోపిన నొఱకడంబు
తప్ప దాధాత కాతని తాతకైన.

అనవుడు నాయండు

బంధుత్వము పెద్దది గుణ
బంధురుఁ డలరాజు కార్యభారము తనపై
సంధించినారు పెద్దలు
సంధికి నీ కొడుకు కంటెఁ జతురులు గలరే.

అను వాక్యంబుల కాయమ
తను వదరన్ గుండె లవియ దర్శన మసదై
కను లింతై మన సంతై
పనవుచుఁ బ్రాణమ్ము లుగ్గపట్టి వచించెన్.

తమ్ముఁడ! పాలకంతమునఁ ద్రావిన వెచ్చని యుగ్గుఁబాలతో
నెమ్మది నున్నవాఁడు తన నిందు మనంబున నొత్తి పల్కఁగా
సమ్మతిచేయలేఁడు పరుసందన మెంతయుఁ గానరాదు వా
క్యమ్ములకూర్పెఱుంగఁ డితఁడా! నెరవేర్చుటసంధికార్యముల్.

వారొక త్రోవఁ బోవరు ధ్రువమ్ముగ నమ్ముము ప్రాణగొడ్డముల్
గోరుదు రాత్మధర్మములఁ గూడరు నెత్తురు ద్రావు మన్నవా
చేరలు వట్టి నిల్చెదరు చిత్తము లుద్దవడిం గలంగినన్
నేరరు; బంధుగౌరవము నీకు నెఱుంగని దున్నె తమ్ముఁడా!

అని నిట్టూర్చునంత నాయందు,

నీవనిన యర్థమాత్మను
భావించుచు నె వీరమాత పగ వగగొన్నన్
దీవించుచు నె వెనుకాడిన
రావించుచు నె పగఱఁ బొడిచి రాని కుమారున్.

నెఱవాది సర్వకార్య
స్థిరుఁ డనుపమ బాహు బల విశిష్టార్థుఁడు సం
గర విద్యా నిపుణుం డిత
డరవాయిం గొనునె శత్రులన్నం దల్లీ!

తెగి తెంపు చేసి పలుకఁగఁ
బగతుర భంజింప బంధు భావము నెఱపన్
మొగమోటమి పచరింపఁగఁ
దగు మెలఁకువ గలఁడు ధైర్యధనుఁడితఁ డెందున్.

అనినన్ నాయనిఁ గౌఁగిలించుకొని బిడ్డా! కాఁగలం డితఁడీ పనిఁబూనన్ మనసొప్పకున్నది క్షమాపాలుండు వృద్ధుండుమున్నవ ముంజేతులు కట్టి నిల్చితిమి మెప్పంగోరి నాబిడ్డ చేసిన సంధిక్రియ కెగ్గు పుట్టుఁ దుది గాసిం బోదు రిర్వాఁగులన్.

నా విని తులసీ దామము
గ్రీవం బెగఁదిగిచి కేలఁ గీలించుచు నీ
తావడ మెవరు ధరించిన
శ్రీవిభవాయుర్విశేషసిద్ధి ఘటిల్లున్.

కావున నొండు దలంపక
మావలసిన సంధికార్య మర్యాదలకున్
శీవికిఁ జేవకు హెచ్చై
యీ వనమాలను ధరించి యేగు నితండున్.

ఆపై నిరువాఁగులకొకటి పుట్టకుండఁ దీర్చి దిద్దు భారం బితని యందున్నదిఁకమాటాడకుమను నాయనివిడు పోపమియుఁ దారుగ్గపట్టి తెగఁ జూచుటయు భావింప సర్వజన సంహారంబు కన్నులఁ బ్రేలినట్లై పాలుపేది కొంతవడి మౌనముద్ర వహించి గతం బాత్మఁ దలంచికొని యొక్కపెట్టున గోలుగోలున నేడ్చి నంతఁ జేఁదుడుచు దాదుల కలవిగాక వేఁడికన్నీరు దృగ్గోళంబుల డిగ్గనుఱుక గొంటఁ జిమ్ముకొనుచు నాయని కరంబులు వట్టి,

జీర్ణించి పోయెనే శృంగార రేఖలో
జాలువాఱిన మేని చక్కఁదనము
అసదయి పోయెనే యానందదీప్తిలో
నోలాడు నిశిత దృగ్జాలకములు
మాయమై పోయెనే మన్మథమూర్తిలో
నగ్గలించిన మార్దవాతిశయము
అణఁగారి పోయెనే యాత్మ బలమ్ముతో
సంపతిల్లిన భుజా సౌష్ఠవమ్ము

చింతలం దోఁగి శల్యావశిష్టుఁడవయి
వలస కర్పించి నాఁడవా! కలితనమ్ము
భాగ్యవశమున నీవల్ల బయటఁ బడిరి
దీనులై నేఁడు బాలమల్దేవ నృపులు.

పచ్చని కాఁపురమ్ము చెఱుపన్ దలపెట్టిన నాయురాలితోఁ
జిచ్చొడిగట్టినా రగడుచేసి పరుల్ విననేమిగా గుణం
బచ్చుపడంగఁ బల్కఁ డొకఁడైనఁ బ్రవాసము దీఱి పోవఁగా
నిచ్చెదమన్న దానికయి యింత దురంతము లాడఁ జెల్లునే.

పొగసిన కుంకుమ రేఖల
మగసిరు లాసించి రాజమందిర భూముల్
పొగచూరి పోవుచున్నవి
మగువల బాష్పాంబుధార మల్లడి గొనుచున్.

పసిఁడి కుంభాగ్రముల నైల్య మొసఁగుచుండె
గండివడి వ్రీలె తోరణగండ్ల వరుస
కుదిసి బీటలు వాఱెను గుట్టిమమ్ము
లూట వెలువడెఁ జవుడులం దుల్బణించి.

అద్దములఁ బ్రతిబింబించు నాననములు
దుఃఖ రేఖా విమిశ్రిత ధూమ పంక్తి
గజ్జెల వ్యాజమున వెళ్లఁ గ్రక్కుచుండె
దుర్నిమిత్తమ్ము లింకెన్ని దోఁపఁ గలవొ !

రాలి కూలిన మేలిముత్యాల చవుకు
చెలిక పట్టిన మేటి గాజుల కొటారు
గందకం బోకిలించిన గద్దగుండు
చాపురనుచున్న వీనాఁటి పల్లెనాట.

ఏ రాజమందిర ద్వార ప్రదేశమ్ము
వీర విద్యా రస స్ఫోరకంబు
ఏ రాజవరు సభాగార ప్రఘాణంబు
సర్వశాస్త్రార్థ నిష్ణాతకంబు
ఏరాజ బాహుద్వయీ రంగధామంబు
భూరమా నృత్య ప్రపూరకంబు
ఏరాజ శాసన ప్రారంభ సంరంభ
మఖిల దిగ్దేశ జయాన్వితంబు.

ఏమహాత్ముని శిక్ష శ్రీరామరక్ష
యెవని ధర్మార్థ సంసక్తి భువనభుక్తి
యతఁడు వొగడొందు నల్గురాజాగ్రగణ్యుఁ
డర్థి సాత్కృత జీవ ధనాధికుండు.

ఆతని వంగడమ్ము తుది కాఱడిపెట్టిన వింతమానుసుల్
చేతికిరారు పోరఁ దమచిక్కని కండల కాసచేయుచున్
'బాతర'లాడు గ్రద్దలకుఁ బందువు దాఁపురమాయెఁబోయిరా
రా! తనయా! తదీయు లెటులాడిన ధర్మము దప్పరా దటన్.

అని యలరాజును దెరమరు
గునకున్ రప్పించి మూరుకొని మేనెల్లన్
బుణికి చని చక్కఁ బెట్టుము
జనపతి కార్యమ్ము బంధు సౌజన్యమునన్.

అని మఱియు,

మేలిమి బంగారు మేల్కట్లు హావణించు
ముత్యాల చవికెఁ గాలూనవలదు
కస్తూరి కలయంపి గార వట్టించిన
చలువ రా తిన్నెల మొలఁగ వలదు
తసిలీల తళుకైన తలయంపి నిలిపిన
చిన్న వెన్నెల సెజ్జఁ జేరవలదు
మడుఁగు దవ్వాల గందవొడి చల్లిపంచిన
యే రాచబాటల కేగవలదు

అన్నపానానులేపనా ద్యవసరముల
సొంత చుట్టాల చూపునఁ జూడవలదు
మన్ను మిన్నేకమైన సామాన్య మనక
రాచపుట్టుక కేలోటు రాక నిలుము.

బాలమల్దేవ భూపతు లార్తి పెంపునఁ
దరలి పోయిన నాఁటి దైన్య రేఖ
రావీరమల్లుని రణరంగ పాండిత్య.
మచ్చు గ్రుద్దింపని యపయశమ్ము
పసికాయ లంకన్న వసవట్టి పోరాడు
మన్నె భూముల జగా మగతనంబు
వలసపోనాడు దుర్భర శోక మూఁకొట్టు
పలనాటి కెళవుల కలవరమ్ము

చెజిఁగి పోలేదు మాహృదంతరములందుఁ
దరలిపోయెను దిగ్దిగంతరములకును
దత్ప్రతీకార వాంఛ లీ తరుణమందుఁ
దగవు తగవేది యునికి మీధర్మ వగునె.

కన్నె కలహామునకుఁ గాల్ద్రివ్వనీకుము
త్రవ్వరేని వెన్నుదన్ని నిలుము
ఆత్మసామరస్య మది లెస్స గాకున్న
బాసవడుట ధర్మ బాహిరంబు.

చెప్పఁ గలవట్టు చెప్పితి
ముప్పున ముంజేతి నీరు ముట్టుటకంటెన్
గుప్పెఁడు బిచ్చంబెత్తిన
యొప్పెదు మనరాచపాడి కొక తల గలదే!

క్షత్రధర్మం బిప్పాటి నీచవృత్తంబున కోపి చన్నెయను కలదగాంద్ర కెట్లాడినఁజెల్లు. తామసించి తగవునడపుట దుర్ఘటంబు. సామంబున సమరసభావం బుప్పతిల్లు. వీలెట్లుండె నట్లలవరించుకొని రమ్మ్మ పొమ్మని కొడుకున కానతిచ్చి మనం బురియాడ నాయనిదిక్కు మొగంబై శూన్య దృగ్వలయంబుల సర్వానర్థసిద్ధి కుపశ్రుతి నెఱపి పుణ్యుఁడా! మనం బాకరీతిగాదు. త్రికాలజ్ఞుండ వీవెఱుం గని దున్నె. సర్వమంగళ సంసిద్ధి సమకూడు గాక. పోయివత్తు. రాచబిడ్డనయ్యుఁ గన్నకడుపు కతనఁ జేద

వడితి. ఇంతకు శస్త్రహీనముకంటె వస్త్రహీన మదిలెస్స యని నాపలుకులుగా నల్వురఁ దోడ్కొని కలనికి నడువుఁడు. క్షత్రశబ్ద మర్ధవంత మగుఁగాక. జయలక్ష్మిం జేకొందురు గాక. నా కానతిండని మంగళ ద్రవ్య సమాలోకంబున నాత్మజున కర్థసిద్ధి గలుగుగాత మని యిష్టదేవతలఁ దలఁపునకుఁ దెచ్చి చేటికాపరివృతయై పల్యంకిక నెక్కి నాయఁడు చేసంటిన పల్లకీ కొమ్మున దృష్టి సారించి నాయఁ డింత యొప్పనాడునే యని లోలోనఁ గొండాడుచు నిజావసథంబునకుం జనె.

అంతట భావికార్య ఘటనానుగుణమ్మగ వేగువారు దో రంతర గుప్తలేఖల జయార్థము చూపులఁ గ్రమ్మరింప ధీ మంతుఁడు బ్రహ్మనాయఁ డలమల్లుని జేరి ప్రయాణభేరి మ్రో గింతురు భానుగోళమరిగెన్ జరమాచల శృంగభూమికిన్.

అల్లుఁడటె పల్లెరాజున
కిల్లడ వో నున్నవాఁడటే తేపట మా
యిల్లిల్లుగాఁగ నెగడదె
నల్లవో! యలరాజు గూర్చు నానార్థములన్.

పిల్ల పిల్ల తరమ పెట్టిన పేరుగా
నెగడు రాచమల్లు నీతిచరిత
సంజయాదు లితని సంధాన పటిమకుఁ
గేలు మోపవలయు ఘాలమందు.

అన సాహో నినదంబు సల్పిరి తదీయాస్థాన భట్టారకుల్
జననాథుల్ జయవెట్టి రంతర సమాజం బోలిఁ గీర్తించె ద్విద
జ్జన సమ్మర్దము నాఁగి వేత్రధరు లాచారానుగుణ్యమ్ముగా
మునుముం దయ్యలసాగనంపి బుజకొమ్ముల్ పట్టిరొక్కమ్మడిన్

పసిఁడి గుబ్బపు బగ్గి పదునాఱు గుఱ్ఱాల
 కచ్చ నేజాజల్లు లలవరించి
చిలుకవన్నెల పట్టు పలుపుఁ గుచ్చుల జీబు
 లలరు ముత్తెపుఁ గూర్పు లనువు పఱచి
జాళువు మేల్కట్ల జాజువాఱిన గుండ్ల
 కించుఁ దళ్కుల కెంపు లేర్పరించి
గాజు టద్దాల చెక్కడపు టంచుల మెట్ల
 కంగు దీవెల మల్కులం గదించి.

కాఁడిమూసిన తఱిమెన గాళ్లబండిఁ
బూన్చి తెచ్చిరి ప్రాంగణభూమి కంత
నాయఁడల రాచమల్లుని కేలువట్టి
తదవరోహణ మొనరించి తరలినాఁడు.

వెలిదూది పింజకట్టుల
బలె మైదానంబు నేత్రపర్వంబై సం
కుల ఘుం ఘుమారవ వ్యా
కులిత దిశాభాగమగుచు గుబ్బటిలంగన్.

తెఱపి విచ్చి మూఁక లరిగిన నిలఁబడి
కాంచు ప్రజకుఁ 'జిత్రకన్ను' వడఁగ
బ్రహ్మనాయఁ డనుప బాలమల్దేవులు
కంచు టరద మెక్కి కదలి చనిరి.

ఆ సమయంబున,

ఓ చెల్ల యేమి పుట్టునో
రాచఱికము గొడ్డువోయె రాజును దమ్ముల్
త్రాఁచుంబాముల కైవడి
వేచి రిఁకే వేళఁ గాటు వేసికొనెద రో.

మన బాలమల్లుదేవుల
వినయం బా తెలివి బంధు విశ్వాసం బే
జనమున కున్నదె దైవం
బనుకూలింపక సమస్త మాహుతి యయ్యెన్.

ఇరువాఁగుల కలయికకై
యరిగెడు నలరాజుగౌరవాస్పదుఁడైనన్
విఱిగిన ప్రతిమకుఁ డంకము
కఱపించిన భంగి నితని కఱద ఫలించున్.

ఏమున్నది పలనాటికి
గామై నాగమ్మ మింటఁ గాఱాడెడు నీ
ధూమములు విషాగ్ని కీలా
ధామోద్గత ధూమ ధూపితములై కుములున్.

అనుచుఁ జిత్ర ప్రతిమలై కొంద ఱాడిరి
కల్లువోయి కొంద ఱల్లఁ జనిరి
చివురు వట్టెఁ గనుల జేవురు పలుచాయ
లయ్యె వీరవరుల కాననములు.

అయ్యెడ,

తద్రథ స్వనంబు దలకొని వెనువెన్క
కూఁత ప్రేటు దనుక గుబ్బతిల్లె
నాఁగి యాఁగి వార లట్టిట్టు గనుగొంచుఁ
జూపుమేరఁ గడచి రాపురంబు.

చనిచని మాచర్ల పొలిమేర వట్టుపట్టున నాఁగి పౌరజన మాబాలగోపాల మెదుర్కోలు పచరింప సంతుష్టుండై మలిదేవుల సంభాషణంబుల సంప్రీతచేతస్కుండై నగళ్లు సొచ్చి విడిదిపట్టునఁ గొలువైన రాచమల్లుచే ననిపించుకొని బ్రహ్మనాయండును దక్కుంగల మన్నీలు కన్నుసన్నల గౌరవ వచనంబులఁ దన్ను వీడ్కొని చనిరి. పిదప రాచమల్లు మజ్జన భోజనానులేపనంబులఁ జెలుల నర్మవచనంబు లెడనెడ నూఁకొని పరసాలాపంబు లాడుచు భావి కార్య పరతంత్ర మనస్కుండై కొంత ప్రొద్దు పుచ్చి మరునాఁడు జేపకడఁ బయనంబయి.

లేయెండ పసుపమున కొక
చాయగఁ దన మేనికాంతి జవ్వాడఁ గనత్
కేయూర మణి వితాన
స్ఫాయద్రుచి చివురు వట్టి పకపక లాడన్.

అందలమ్ము నెక్కి యడపమ్ము సవరించి
తమ్మనమలి రడ్డిగమ్ము సర్ది
వల్లెవాటు దీర్చి వాల్లభ్య మేపార
హస్త సంజ్ఞ చేసి యచటు వాసె.

గమిడి దాఁటు వేళఁ గాలాహి పుట్టపైఁ
బడగ విప్ప గరుడి యొడిసి పట్టెఁ
బాలవంచ గూసెఁ బయనంపు సందడి
దూల నడచె మందికాలి కోలఁది.

ఆ 'యపురూపు' బయళ్ళను
బోయలు శిబికాధిరూఢుఁ బొగడుచు నుత్సా
యహోత్త చిత్తు లగుచున్
గోయని మని కొమ్ము మార్చుకొని చనుచుండన్.

చల్లఁగ నావులించె నవ సారస గంధము గంధవాహ మ
ల్లల్లన నేగుదెంచె నుదయాద్రి సముద్గత గైరిక ప్రభల్
చల్లిన యొత్తు డాలు దిగజారెఁ గ్రమంబుగఁ గొండగోఁగుపూ
జల్లి విధాన మింటి నడుచుక్కకిఁ బ్రాఁకెఁ బతంగ బింబమున్.

బండ పగిలి పిట్ట పడిచచ్చె నెనుములు
మడువు సొచ్చె నమ్మె వాడిచెఁ బుడమి
బీడువట్టెఁ బసులు బీరెండ తాఁకున
నీడఁ ద్రొక్కె ప్రజ వినిర్గమించె.

దివ్య గంగా స్రవంతిలోఁ దీర్థమాడి
యగ్ని కుండిక నొదల నవధరించి
ప్రకృతి సంతాప విస్ఫూర్తి భానుమూర్తి
యుగ్ర తాండవ మొనరించె నుష్ణరముకు.

కట్టెదుట నాతపాగ్నికిఁ
దెట్టులు వడి తెరలు నేటి తెప్పలలో న
ట్టిట్టూఁగు చండ దీధితి
చుట్టములై బుద్బుదములు చూడ్కుల కించెన్.

దగ దొట్టి బోయ లచ్చట
దిగ విడిచిరి శిబిక; నపుడ తెచ్చిరి తేజీ
నెగుదలగా నొక కొందఱు
మొగము ట్టమరించి రాజు మ్రోలకు సరగన్.

అంత రాచమల్లు కురంగట దాపట కలనుండి క్రేళ్లుఱుకు లేడెవాఁగున కేటవాలుగా విడిచి మధ్యాహ్నాతప గ్లాని నసురుసురై యుమ్మఁకుఁ జెమ్మగిల్లిన నెమ్మొ నొక్కింత సేదదేరఁ జిఱు తరఁగలం దోఁగు నులివెచ్చ గాడ్పు పైఁ

నొలయ వలిపం బల్లార్చి వట విటపి చ్ఛాయ ననుయాయి
లలవరించిన సెజ్జ మేనుజేర్చి కుడి వలన నొరగిలి పథి
శ్రమాపనోద క్రియా సూచకంబుగా నిట్టార్చుచు
వట్టుపట్టు నుత్తరించు నుపాయం బరయుచుండె నింతలో–

బాలచంద్రుఁ డపుడు బ్రహ్మన్న పంపునఁ
దగరు గుఱ్ఱ మెక్కి తరలి వచ్చె
రాచమల్లుఁ డతనిఁ జూచి కన్నులఁ ద్రావి
పలుకరించెఁ గూర్మి మొలక లెత్త.

ఏమిట వచ్చితీవు మఱఁదీ ! శ్రమకైతివి వాడు వాతె న
మ్మోమని బాలచంద్రు మొగముం గన నవ్వి ప్రచండవిక్రమో
ద్దాములు స్వామి లుద్ధత పథమ్ములఁ బోదురు లేదె వాఁగు వె
న్నాములు దాఁటఁ బంపుమనినారదిగా చనుదెంచితిన్ బ్రభూ!

అనవుడు రాచమల్లుఁ డపహాస్యమొనర్చుచు నిట్టి పల్లి ని
న్ననుతురటయ్యా ! కప్ప కొఱగైనది కాలని గ్రుడ్డు మోచు నా
ఛనవరి వౌటఁ జేసి యెకసక్కెము లాడితి నన్న బాలుఁ డా
నని బదులాడఁ గొంకినటులై పనివిందు ననెన్ వినమ్రుఁడై.

రాచమల్లుఁ డంతం బోనీక ముద్దు మఱఁదీ ! మన్నుద్ధరింప
కేల చనియెద వీ వట్టుపట్టు నుత్తరింప సావరాలజమ్మున
కైతిగా నోపదు. ఈవు తగరు వాహ మలవరింపు మనుడు
బ్రహ్మన్న కొడుకును దన్నెకసక్కెమునకుం దిగిచి

బావా! మిమ్మింతట విడుతు మనకొంటిపే. మీతోఁ బన్నిదంబు చఱువ మనసయ్యెడు నింద మీవార్వంబులం దెద్దీవంక నొక్కెత్తున నుత్తరించునో దాని కోటరి నిల్వ దోఁపి డీవలయునని తమచే నొ ననిపించుకొని ముందఱఁ బెద్దఱికంబు వాటించి యలరాజు నెక్కఁ బొడిచె. అతం డదిగా నొపవాహ్యం బధిష్ఠించి 'ధే' యని యదలించుడు నది తొట్రుపాటున ముంగాళు లవ్వలియొడ్డు మోవఁ బృష్ఠభాగంబు నీటఁ దోఁగ నువ్వున గూనుగిలం బడియె. ఇంతయుం గమనించు బాలచంద్రుం డుల్లాసంబు దీపింపఁ దగరు గుఱ్ఱం బధిరోహించి చటుక్కునఁ జబుకు వ్రేయ నది బిల్లంగోడు వడువున నవ్వలుప ట్టుత్తరించె. అంతఁ బన్నిదంబులకైన మాడ్కి నలరాజు నివ్వెఁడు సొమ్ము బాలుం డూఁచముట్టుగాఁ గైకొని మాటాడక సావరాల మార్గముంబట్టి చనియె. రాచమల్లుండు నిదొక యసదర్థం బుగ భావించుకొనుచుం బుగ్గరాజాదులు దోతేర గుర జాలాపురిం బ్రవేశించి తత్రత్యులగు రాజబంధు లామ తింప వారల కింపువుట్టఁ బలికి మైలమ దేవిడికిం జనియెద నని బంధువర్గమును దానుం దదీయసదనాభిముఖుంబయ్యె.

మనుమరాలి భర్త మునుముందు తనకడ
కరుగుదెంచు వార్త కాత్మ నలరి
మైలమాంబ పేరమాదేవి రప్పించి
యెదురు చూచుచుండె నింతలోన.

మల్లుఁడు వచ్చి యవ్వకు నమస్కృతి సల్పి తదాశిషమ్ము సం
ఫుల్ల మతిం గ్రహించి నగుమోమున గద్దియ నెక్కి నంతనే
చెల్లమ కొమ్మరాజు తనచెల్లెలు బావలు తక్కు రాచ వా
రెల్లరు సేమముండి రట వేయను మైలమ కాతఁ డిట్లనున్.

మామ దయా విశేషమున మాకు సుహృజ్జనకోటి కెల్లెడన్
సేమము కాని యొండొకటి సెప్పెదఁ గానలఁ గోనలన్ దితి
జౌ మహితుండు నాయఁడనిశమ్ము శుభమ్మొనగూర్చుటన్ సుఖ
శ్రీ మము వాయ దక్కతనఁ జెల్లమపుత్రున కెందు లోటగున్.

బడుగయి తోడుగఱ వలె ని
వ్వడువునఁ గొడుకులకుఁ గుందువారికిఁ దక్కన్
బెడదలు మాదృశులకు నె
క్కడి వవ్వా! యంచు సూక్ష్మగతిఁ బోనాడన్.

మైలమ పిన్న నవ్వు నగి మాటల సంగిటఁ గ్రుక్కి రాచవాఁ
డా! లఘువాడనేల! కొడు కైనది కాని దెఱుంగఁ డెల్లరన్
దోలి మహానుభావు లిలుద్రొక్కి భజింతురు వారి కేడ్వనా
గోలకు నెత్తిపాలికొఱ గొడ్డెము లాడెడువారి కేడ్వనా!

పిన్నలఁ బెద్దలం గలఁత పెట్టకుమయ్యవు వచ్చి తీవు మా
కన్నుల వెన్నెలల్ దనియఁ గాచిన విన్ని దినాల నుండి మా
కన్నము నీళ్ళు వట్టినవటయ్య సుధామయ చంద్రశాలలం
దున్న శ్మశాన వాటికల నున్నటు వేఁగితి మింతకాలమున్.

అయ్యయ్యో ! పాల్గొనెడు
నయ్యవిటుల్ బ్రద్ద గజ్జనైతని తెప్పల్
పయ్యంట నద్ది కొనుచును
దయ్యము దూఱుచు విచార-తత్పరమతియై.

అటునిటు రాజ్య సంపదలకై తి వనారతమాస చేయుచున్
భటులునమాత్యులున్ గురులుబంధులుమిత్రులు గొల్వసమ్మదో
త్కట మతినై సమస్త వసుధాతల మేలక ఖండ భూమిభృ
త్తట చటులోగ్ర కానన పథమ్ములు పట్టితి వేల బేలనై.

విన్నది నాఁడు నేఁడనక ప్రేముడి జవ్వన మెల్ల నీకునై
జన్నియ పట్టి యున్నయది చక్కని దీదృశురాలి వీడి నీ
వెన్ని శరత్తులుంటి వెవరే నిది విన్న సదర్థమందురా
మన్ననఁ గల్గువాఁడవె కుమారక ! మోఱకు లట్లొనర్తురా !

మమ్మయినన్ గణింపవొకో మామకు నీకును రాజకీయ భే
దమ్ము లెసంగవచ్చు నవి ధర్మవిపక్షులు దేల్తు రింత మా
త్రమ్మున కల్గి సర్వధన దార హితాదులఁ ద్రోసిపుచ్చి మ
మ్మిమ్మెయి నేడిపించి వలసేగితివే తగవేది మాదెసన్.

ఔనటు మేనయత్త సుతు లౌరస భాగము గోర వారికై
ప్రాణము లీక తప్ప దిటువైపున కల్గుఁడ వేవిధాన సం
ధాన మొనర్తు వంతయు బదాబద లౌటకు నిన్నుఁ బంచి రా
మానుసు లీడఁబోక కసుమాల మొనర్తురు కార్యవాదముల్.

మనమది మాటగాఁ దెలియుమా! పలానా డఖిలమ్ము జేప్ప నీ
పనుపున నిల్వ నున్న దిది బ్రహ్మాన ముఖ్యుల కంతుపట్టి యే
మనుపడి రీవు నేఁడు సగముం దమకొప్పన సేసి యే మొగ
మ్మున బహివెట్టఁ జూతువుసమూహ మొనర్తువె ముందు వెన్కలన్.

అని మఱియు,

ధర్మ దయార్ద్ర బుద్ధి యని తత్పరభావము కల్మి నాఁడు వా
రర్మిలి గూరి గాదు తమ కాతఁ డెదో తలఁద్రవ్వి పెట్టునన్
దుర్మతిఁ గొల్చుచుండి రిది దోఁప కమాయికు లెంద తెందఱో
నిర్మముఁ డందురాతని వినింద్యచరిత్రము మాకుఁ గ్రొత్తయే.

అన విని మైలమ నట్టి
ట్టన కలరా జిష్టమగు పదార్థము విమ మై
నను స్వీకరింతు రవ్వా!
పనివిందు నటన్న నాత్రపడి మైలమయున్.

తదుపేక్షా భావం బెఱింగి రాచమల్లు చిబుకంబు వట్టి నాయనా! రాకరాకరుదెంచి యింత కుడిచి కూర్చుండ కిమ్మెయిఁ జనువాఁడ విందమని భుజిష్య నామతించి బంగారు భృంగారకమ్మున నీరు వెట్టింప నతఁ డౌనుగా దనక ప్రక్షాళిత పాణి పాదతలుండై యాదల వాంచి మైలమ మున్నుగా భోజన శాలం బ్రవేశించె. అంతకు మున్న యడబాల పర్ణ్వరీణంబు పుచ్చి నీరార్చిన రంభా ఫలాశ దళంబు షడ్రస గ్రాస సమృద్ధంబుగా నలవరించి

వైదొలంగుడు రాచమల్లుఁ డవ్వాచవులుగ్గడించుచుండ భుజిక్రియావసరంబు నెఱపి తాంబూల చర్వణానంతర మించుక విశ్రమింపఁ జంద్రశాలాభ్యంతర ప్రదేశంబు సొచ్చి సకినల మంచంబునఁ బవ్వళించె నంత,

పిలిచినఁ బల్కు జవ్వనము పిండక జొబ్బిలు ప్రేమ కంటి చూ
పొలసిన మాయ చాయ తనకొక్కొకఁ డొక్కొకసొమ్ముగా బయల్
కల గన నేగు దెంచె నలగామ నృపాల కుమారి నవ్వు పూ
వులు విరఁజిమ్ముచున్ వలపుఁబుప్పొడి తేనియఁబ్రుక్కిలించుచున్.

సిగ్గటుపాఱ నూకి తమిచే మరుఁ జేసిన యంపకోల నా
దగ్గఱుచున్నఁ గొమ్మ వసుధావర పుత్త్రుఁడు కన్ను లింతయై
దిగ్గన లేచి కౌఁగిటఁ గదింపఁ దలంచియు నిగ్గి మ్రొగ్గి న
ట్లుగ్గులు వాఱు కోర్కు లొకఁడొక్కడె క్రేళ్లుఱుకన్ ద్రపిష్ఠుఁడై.

పారమెయ్యిన ప్రేమ పట్టు కొల్పఁ దలంచు
బింబాధరమ్ము కంపించు టరసి
కెడఁగూడు నాసక్తి కీల్కొల్పు నందంద
మోహ ముద్రిత ముఖామోద మెఱఁగి
చవులూరు కాంతి వెల్లువ దోఁగఁ దలకొను
నా నఖశిఖము కన్నారఁ జూచి
చివురు చెమ్మట తావు లివురొత్తఁ గాంక్షించు
నలఁతి యూరుపు గాడుపులకు నలరి

తనుకు నారటమునకు బాధ స్తరంగ
మై రసాత్మత ద్రవియించు నట్టి సతిని
నిండు కౌఁగిటఁ గఱఁగింప నేరఁ డాతఁ
డేస విరి నేసి గారింపఁ డేమొ మరుఁడు.

వలపుఁ గస్తురి నామమ్ము వన్నె దఱిఁగి
పచ్చి గందపు మైపూఁత పలుకఁ బాఱె
పేరమాదేవి నిట్టూర్చి ప్రియున కనియెఁ
ప్రేమరస మిర్వాలంకులఁ బిక్కటిల్ల.

పేర్మి మొలక గట్టి యూర్మిళ వడువున
బ్రదికి యున్న ఫలము వడసె నేఁటి
కలుగురాజు మనుమరాలని చెవి చెవి
గఱచు కొన్న దిరుగు పొరుగు నేఁడు.

మగనికిఁ గోఱగాని మనుగడ రిత్తకు
రిత్తను చెలుల వారింపఁ దలఁకి
ఇంతపాపము చూడ మెందను చుట్టాల
సానుభూతికి రాజసమ్ము వాసి
మురువు ముచ్చటులకుఁ గఱవైతి నను పొక్కు
తల్లి కన్నీటి చిత్తడిఁ గఱంగి
దౌర్భాగ్య యని తండ్రి తలఁపు లంగిటఁ గ్రుక్కి
మలఁగి చూడక పోవు మాడ్కి కడలి

సిగ్గు చిదికి కుమారిలు జీవితమ్ము
నిస్పృహా పథమ్మునం బయనించుచున్న
దెండమావుల క్రియఁ గోర్కె లెసకమెసఁగ
నేయెడారులు వట్టునో యెఱుక పడదు.

అయ్యకతనఁ గూఁతు రాఱడిపాలైన
దన్నఁ దలఁక నడ్డమాడ నొల్లఁ
జిత్త మెరియఁ జెవులు చీములు కట్ట మి
మ్మాడు వారి నందు నోడుచుందు.

ఈ జనశ్రుతి నన్నలయింప కుండు
గంగదారి మడువులోనఁ గలిపి చన్న
నాలి కన్నను మేనత్త కైనవారు
తీపి యను కొంతయుం దేట తెల్లమయ్యె.

వలస వోనాఁడు మీకోఁజ కలమటించు
ప్రేమ భిక్షుకి కాత్రైక భిక్ష పెట్టి
తరలితిర తాళి గట్టిన ధర్మమైన
నిప్పటికి సైత మెరియింప దేమి కతమొ.

ప్రేమభాజను లిట్టి రాజ్యామిషంబు
గోరి దార సుతాదులఁ గోలుపోవ
రభినివేశము ప్రతిజీవి కవసరమ్మొ
కాని సమరస భావ మెందేని వలయు.

ప్రజల హితము గాంచి ప్రభుత సాగించెడు
ధర్మరాజు లిట్లు తారసిల్ల
రైన మీకుఁ దెలియ నట్టి దేమున్నది
కన్ను గలిగి మెలఁగుఁ డన్ని యెడల.

కావరుఁడైన తండ్రి మిముఁ గైకొనఁ డల్లుఁడ వన్న ప్రేమ త
న్నేవిధిఁ ద్రిప్పునో తెలియ దింతకు నీవల నావులించినన్
త్రేవులు లెక్కపెట్టెదరు పెద్దయుఁ గాలము నుండి బాలమ
ద్దేవులఁ గీటడంచుట కదే పని వేచిరి కాచి రందునున్.

శీలము బ్రహ్మనాయఁ డెటఁ జిక్కిన జిత్రవధం బొనర్తు రా
గాలిటు సోఁకరా దతఁడె గాదొక వేళఁ దదీయు లిచ్చటన్
గాలిడిరా వధింత్రు గనుకన్ మిముఁ బంచిరి వారు; వీరి యా
ల్పాలిటు లున్న వేమొనరుపంగల రన్యులుమాన్యకృత్యముల్.

మిమ్మెటు పఱతురొ నాహృద
యమ్ముం జెయి వెట్టి కలఁచినట్లున్నది చి
చ్ఛమ్ముచు నిది చిత్తడి పా
కమ్మని నమ్మింతు రెఱుకగల రేమందున్.

పగ లెస్స గాదు భూపతి
తగ వేదినఁ గోప వహ్ని దరికొను నాపై
సిగపట్లగు నిరువాఁగులు
వగ గూరును లేని పోని వైర మదేలా !

కయ్యము వలదని నా పి
న్నయ్యలు లోకమ్ము లెట్టు లాడినఁ బడిరా
దయ్యము గల దన్నిటి కిటఁ
గొయ్యలు చివురింప వివకకున్ ఫలమేమీ !

నాదైవము విటు వచ్చితి
వే దోసిలి వట్టుదును గ్రహింపుఁడు మునుముఁ
దేదేని నాకుఁ గానిది
లేదా ! నాఁ డనుభవింత్రు లెండనరాదా !

వలసిన వచ్చెద మన మీ
పలనాటిన్ విడచి యడవిఁ బడి మునివృత్తిన్
వెలలుద మాకలముం దిని
సెల నీరము లాని సంభజింతము ప్రకృతిన్.

ఎందులకు వచ్చె నెత్తుటి
పందెము లీరడుగ నేల వారలుకమెయిన్
గుండాడ నేల కాల
మ్మిందం దెస రేఁగు నీర్ష్య లెడపు న్నడపున్.

నాకేమి వలయు నాథా!
మీ కాలికి బలపమై సమీహిత బుద్ధిన్
బ్రాఁకెద లోక మలోక
మ్మేకమ్ముగఁ బ్రేమలోక మెటనో యటకున్

అని జాతి ప్రతిమ వడువునఁ
గనుగొను పతి పదము లంటి కడు భక్తి మెయిన్
గను దోయి కద్దు కొనుచున్
బెనఁగెన్ లతకూన కరణిఁ బ్రియుఁ డుల్లసిలన్.

మల్లుఁ డంత వంగి మగువ మణీమయ
వలయ హస్త పల్లవమ్ము వట్టి
వెట్టి పడుచ ప్రేమ విషయైకజీవను
లప్రియముల కోర్వ కందు రిట్లు.

వీరొకఁ డిత్తురు వారొక
చేరెఁడు గైకొందురన్న చిత్తమ్మున రా
మూరక పెనఁగెద వేలా
నీ ఉగుదురు వారు వీరు నిందాస్పదులై.

సీతలం పే నెఱుంగుదు సఖలార్థ వేదియగు బ్రహ్మనాయని పంపున నీ కార్యభారం బొదల ధరించి వచ్చితి. ఇందెగ్గాడిన యవ్వామనస్సు నొవ్వనాడఁ బుయిలోడితి. అమ్మహాత్ముఁ డిరుతెగల వారి కింత గూర్చువాఁడని మాత్ర మెఱుంగునది. ఇ య్యుభయపక్షంబుల కేది పుట్టిన మా కుపేక్షింపంజనదు. ఈశ్వరసంకల్ప మెట్లుండె నట్లగు నైనఁ బౌరుషము వాటించి చెప్పంగల వట్టు సెప్పెదను. ఇందలి హితా హితంబు లూఁకొని కర్జంబు వట్టిన శుభోదర్కంబులం బొదలుదురు. ఇంతకుం దక్కిన

దుర్జయాన్వయం బొక్కెత్తునఁ బోలియు. నీ కతంబున నే నొక్కరుండ నీ సర్వం సహాధికార భారము వహింతునను నాశ లుడుగుఁడు. చచ్చిన నొచ్చిన నయ్యతోడిదే లోక మనువారము. తెలిసినదా! ఇప్పటికే సగప్రొద్దు కడచన్నది. అవసరజ్ఞు లామతింతురు. మగిడి పోవువేళ నొకకొంత ప్రొద్దిట మసలుదుననుడుం బేరమాదేవి యామె దిన్నశైై తలవాంచి బొట్టన వ్రేల నేల రాయుచు ముంగొంగు లిరుకేలం దిగిచి మొగ మపవారించు కొనియెను. అంత రాచమల్లుఁ డామె నెట్టులో కొంతవడి కోదార్చి శయ్యాగారము వీడి ప్రతీహారు లిందమని పార్శ్వంబుల కొత్తగిల త్రోవ సూపఁ గక్ష్యాంతరంబులు గడచి ప్రఘాణమ్మునఁ దనకై నిరీక్షించు రాజపురుషు లిరుగడ నేతేర నౌపవాహ్యం బధిష్ఠించి యాస్థానాభి ముఖుండయ్యె. ఆతని రాక నెఱింగి యంతకు మున్న కొల్వు దీర్చిన గొతరాజాదులు నలగాము నెచ్చరించు నెడ నాయకురా లాశ్చర్య మభినయించుచు,

ఏమంటిరి రాజా! మా
జామాతను బంచి రచటి స్వాములనియు విూ
రేమనుకొంటిరొ లోఁగడ
మా మదిఁ గల దక్షతాల మాత్రము జరిగెన్.

అందున్న దెల్ల మాయల
మం దం ద్రగేసరుండు మన బ్రహ్మన యిం
కెందుల కన్యము జరుగును
గొందికిఁ ద్రోయించు నతఁడ గొంతులు గోయున్.

ఈపిలుపిచ్చు విద్య లెవఁడే మెఱుఁగున్ మొనగాఁడవన్న చో
దోపిడి సేయవచ్చు నట దున్నొకఁడీనిన దన్న పెద్దలో
క్షోఁపున గాటఁ గట్టుఁడనుచుండ్రుయథార్థమెఱుంగఁగోరవా
రాపద వేళ నడ్డపడు నయ్యలు నూటికి నొక్క రుందురా !

ఏమని వారు పంచి రిట కేమొనరింపఁగ వచ్చె మల్లుఁ డీ
భూమివిభుం డమాయికుఁడు ప్రొద్దెటు పొడ్చిన దేనెఱుంగఁడా
స్వామిని జూచి వారి బల శౌర్యముల న్వాని కట్టఁబెట్టునం
దీమస మొందు దక్క నిటఁ దేఁకువ లారసి నట్లు దోఁపదే.

అనిన గౌతరాజు మనంబునఁ గుతిృంచుచు.

అల్లుఁ డతె మామ చనవున
నల్లమ్మునఁ దొడుగఁడతె సముజ్జ్వల శీలం
బొల్లని చుట్టఱికమునకుఁ
జెల్లుం బోరాము లయ్య చిత్త మదేమో !

పగతురైన నొదిగి పా లడిగింతురు
బెట్టిదములఁ దీర్పు రెట్టిపట్ల
నిర్వ్యాలంకులకును హిత మాడువారినే
పంతు రెందు రాయబారములకు.

పోలిన విందుము తోఁబుజా
లేలా గ్గైకొంద మవలి హిత మెబ్బంగిన్
దూలిన జాలిం బెట్టము
మాలిమి చెడనాడు టధిపు మన్నన కగునే!

ఆఁకొన్నవారు మునిఁడిం
జేకొందు రె వలసి నంత సిరి గోరెదరో
లే కర్థరాజ్య మడిగెద
రో కాఱొడ్డెములఁ దీర్తురో తేలునుగా!

పెక్కురు పెక్కు విధమ్ముల
నుక్కు మిగిలి పలుకు టంత యొప్పదు కర్ణం
బక్కున గదింపుఁ జూపిరి
ముక్కున నున్నంత దనుక మొగ మోడవలెన్.

అన నరసింగరాజను మహాత్మ! ప్రజాహిత జీవనమ్ము మీ
రనుదిన మ్ముగ్గడింతు రరులవ్వాల ఱొమ్ముల మీఁది కుంపటై
గనగన లాడుచుండ నిది కార్య మకార్యము శాంతిదాంతియం
చునుకులు వోవఁజన్నె! పతియున్ మతిలేకవినున్ భవన్నుతుల్

తొల్లిటి చనవున నెగఁబడి
రల్లరి కీనాఁడు దమ్ము లాప్రయి వెట్టన్
మల్లుఁడు గాదల్లుఁడు గా
దల్లాతఁడు దిగ్గవచ్చి యడిగిన వెడఁగా.

ఏమును వారు బంధువులమే కుల మాఱుపఁ జూచు వైష్ణవ
స్వాముల నూఁదిపట్టి యలుపాలకుఁజొచ్చెద రేమొగమ్మునన్
మామని నేఁడువచ్చె వినమా! వల సేగెడు నాఁడు కాళ్లు వ్రే
ళ్ళైమెయిఁ బట్టి రా జలమటించిన దించుక గుఱ్తు లేదొకో!

ఇఁక మీమోములుసూడమన్న మొనగాఁ డీరాచమల్లుండు చి
వ్వకుఁ గాల్ద్రివ్విన జబ్బడాయి నిలుపోపం బట్టి సాగించి రీ
సెక లీభూపతి మోముఁ జూచి సయిరించెన్ జెట్టి రాజెంత వ
త్సకుఁ గూర్చున్నను నోరుపట్టనివి రాఁ జన్నె సమాజమ్ములన్.

ఆరయఁ దప్పు లేదని కదా! పెఱవారికిఁ దోడు సూపు మీ
ధోరణి ముష్కరాధములతోఁ బడి నేఁటికిఁ దేరుకొంటి మా
నీరసమింకఁ బాయ దవనిం గొనవచ్చిరి వారికింత చే
జాఱిన నోరు జాఱిన నిజమ్ముగ నీళులు పుట్టనిత్తురే!

మన్నడిగల మానిసి సడి
సన్నయు లేకెంతొ గుట్టు చక్కఁగ నవ్వన్
మన్నింపఁ బోయె నయ్యకుఁ
గన్నాతని కన్నఁ గూర్పఁ గలదే యెందున్.

పోరాని చుట్టమా! తన
కీ రట్టడితనమదేల హితవాదులకున్
దూరగుఁడయి నిత్యము వ్రే
లాఱిచి తినువాఁ డగులు నతఁ డల్లుండా!

కొమ్మన్న కొడుకింత కొమ్మనగాఁ డన్న
సంగతి తొల్లి వా చఱచి చెప్ప
వారిఁ గానఁడు పతి వాల్లభ్యమున కొను
నుభయ వంశంబుల నుద్ధరించు
నను నాప బిడ్డ నిచ్చిన నేరమున కింత
చేసెఁ బోనీ యుపేక్షింపఁ దగదె
యైనవారలకెల్ల నాకులఁ బెట్టించి
కానివారల కెల్లఁ గంచములను

బెట్టి కుడిపింపఁ జూచెడి భేద బుద్ధిఁ
బిలిచి తగుదని సరసన పీఁట పెట్టి
గారవించుట మాచేతఁగాదు సూవె
నీతి బాహ్యులకుం దక్క గౌతరాజ!

అని వెండియు,

పతిగలఁ డుచితానుచితము
లితవులు సెప్పంగ మన కదేలా తల తోఁ
కతికి మొలం బెఱికించెడి
వితె మెఱుఁగ మటన్న మంత్రి వెలవెల పోయెన్.

నాయకురా లింతయు వినివిని గౌతరాజు నాక్షేపదృష్టిం దిలకించి మన మింత త్రవ్వనేల తా నేడేండ్లయ్యాలఁ గొల్చి తదంతరంగంబు లెఱింగి మామం దిద్దు పూన్కి నే తెంచి నట్లున్నది. అతఁ డెంతవట్టు పూఁచిపట్టి వచ్చెనో

సంగతార్థమ్ము తేలంగల దన్న నలగాముం డుదిలకొని పెద్దలిందఱుండిరే తమ్ముం గాదని వీని సంప్రటకుం గతమేమి ? తొల్లింటి నుండియుం దదుపాంశుక్రమం బిట్లే చెల్లి వచ్చుచున్నది. ఐనం బెద్దవాండు కొమ్మరాజే తెంచి తగు చక్కట్ల మప్పి కర్జంబు వట్టింప నెవరు గాదందురు. తమకుం దార్లై వచ్చినం దమ్ముల నేమందుము. తమ కార్యఖడ్గంబు లొదల ధరించి నడచు నాయం డింత పరామర్శింపం దగండా ! లోని రిత్తయు వెలిపొత్తును బ్రకటించు వారి చిత్త వృత్తు లిప్పాటివనం జెల్లు. ఇపు డేపనుగు వట్టి పెనంగెదము. తెలియ రాకున్న దన నాగసాని కొలనేసిన వడువున నోలమాల గుడుచుచు,

పనుగున కేమి వచ్చె నరపాలక మీ రఱవాయి గొన్నచో మునుపడ వెల్ల వెంటలు సముద్ధతిం జూపిన నీఱతాఱలన్ బెనంగెద మెంతమంది పృథివీపతు లెందఱు కోయ నాయకుల్ మన వయిపుండి రెందు కనుమానము ప్రాణములున్నం జూడ రే.

కనుకులగం గుదాత్త బలగర్వితుం డయ్యలమల్లుగుండ రాజనుపమ ధైర్య సాహస సమన్వితు లుగ్రకుణాడుం డుక్కుమున్కనుకొనుం డల్లుమాడి విజయాంకుండు మన్నియచోడినూరబ్పినం బెనుబారం దీయుదురు చెప్పెడి వేమితర ప్రమేయముల్.

ఆరయఁ బల్లెనాట నయిదామడ మేరఁ ద్వదాజ్ఞ విన్నచోఁ
బాతెడు నీళ్లు కట్టువడుఁ బైపఱతెంచెడు పక్షి సైత మా
తీరున నాఁగి పోవలెఁ బదింబది విందము గోరఁ దీయఁగా
నేఱయి పాఱు నీ కథ లనేకము లోకము లాడిపాడఁగన్.

మాడుగుల రడ్డి ప్రభృతుల మాట విన్న
గుండె బెండయి బ్రహ్మనాయండు వగచు
శ్రీగిరిం దొట్టి మాచర్ల సీమదాఁకఁ
దారసిల్లరె మన దుముదారు దొరలు.

వారికులికి రాజ్యభాగంబు పంచుట
మేఁకవన్నె పులికి లోకు వగుటె
నెగడి సూపు వారె నిట్రాడి నెక్కుడు
రగడు సేయువారె తెగి వచింత్రు.

మంది మార్బలమ్ము మారణాయుధములు
వలసినంత కోశ వైభవంబు
కొదువ లేదు మనకుఁ గోకొల్లగా నున్న
దింతగలిగి సంశయింతు రేల.

కావున నల్లుఁగుఱ్ఱఁడిది గైకొన కాడుఁ దదర్థ వాదముల్
దేవరవారు విందు రదలింపక తప్ప దపోహఁ జేసి యెం
జేవిధమాడినన్ భవదభీష్టము చొప్పునఁ బోదురేని సం
భావనసేసి పుత్త్రము విభాగ పరిస్థితు లోడకాడినన్.

ప్రయివెట్టనగు నావిజయం చేయునది రాచమల్లుండుగానోపు
నౌపవాహ్యాపసర్పణంబున కందలి ద్వారజనం బుత్క్షిప్త
లంపడ నటఁ గ్రందు సందడిం బలసి బుగ్గరాజాదు లగ్ర
గాములై తన్నుపచరింప వేత్రవతీ కరావలంబియై చను
దెంచు వాఁ డనుడు నలగాముం డున్నమితాననుండై
నరసింగరాజు నుద్దేశింప నతఁడెదురేగి మందహాస నిభృత
ముఖుండై కరంబులు వట్టి తదామంత్రణమ్ము వడసి
ప్రవేశానుమతి సూచించెను. అంత మంద గమన
సౌందర్య రేఖం బోల్చు కరికలభంబు వడువునఁ గడలు
ద్దాడ నడతెంచు రాచమల్లుం గనుంగొని తత్రత్యు
లా సంస్థానసౌష్ఠవంబున కచ్చెరువడుచు హృచ్ఛయం
బులఁ బాడుకొల్పిరి. ఆ వచ్చు మల్లు నల్లంత నాదరించి
భూధవుం డర్థాసనం బిచ్చెఁ దక్కుంగల వారెల్ల రుత్థితులై
రాచపాడి నెఱపిరి. ఆ పై భూపాలుం డల్లుఁగుఱ్ఱని సేమం
బడిగి,

త్రోవ దప్పినారె శ్రీవారనన్ సుంత
కల్లువోక రాచమల్లుఁ డనియె
నిపుడు దప్పుటేమి యేడేండ్ల ప్రొద్దాయెఁ
గ్రొత్తసేసెనేమొ చిత్తములకు.

అది మీ మా నెయ్యమునకుఁ
గుదు రెట్లాడినను ముద్దు గొల్పును బెద్దల్
మదిమదిఁ బోదు రనంగొలు
వెది పుట్టునొ యని తలంచె నెత్తిన భీతిన్.

కొలు వరసి నృపతి మోమున్
దిలకించి నృసింహరాజు దిక్కు మొగంబై
ములువాసి మేర మీఱక
పలికె న్మల్లుండు బంధుభావము గదురన్.

మీ రెల్లఁ బెద్దలరు కా
ర్యారంభము లెఱుఁగుదురు సమన్వయ బుద్ధుల్
నేరని నేనెక్కడ మీ
తీ రెక్కడ దిద్దుఁ డిందు దెప్పరమైనన్.

మీరు వారు నొక్క తీరు మా కెల్లెడఁ
గూర్తు రెలమి బంధు కోటిలోన
నందుకతనఁ గడవ కడకొత్తు పోకల
మైతి మెటువచింప నయితి గాదు.

తమ్ములు వారు మీహృదయ తత్త్వ మెఱుంగుదు రింతగ్రాస వా
సమ్ములు గోరుచుందు రొక చక్కని మీదయ వచ్చి నంత కో
కొమ్మనుఁ డర్ధరాజ్యమునకుం బ్రయతింప రనర్థకారి యు
ద్ధమ్మునకుం గడంగరు యథాస్థితి నిక్క మెఱుంగఁ బల్కితిన్.

వా రడియాసలం బడక వచ్చి తమంతటఁ దా రొకింత మా
కోరికి దీర్పఁడన్నఁ గయికో కెడనాడిన సభ్యలోకముల్
దూఱుఁ బరుల్ తలెత్తి తమతోఁ జెయిగల్పుదు రొక్క పట్టునన్
పోరు ఘటిల్లు సర్వమిఁక బుగ్గయి పోవు నిరర్థకమ్ముగన్.

చెప్పెడి వారి నాల్క తుదిచేఁదు గ్రహింపవ! నిన్నుఁ జెప్పి వా
తప్పులు దిద్దుకొందురు వృథా వివదింతురు కప్పకూఁత పా
మెప్పుడు నోరు విప్పి కబళించు క్రియన్ ముఱుచ ల్పదార్థముల్
చొప్పడునంత వట్టెదురు చూతురు దోఁచెద రూఁచముట్టుగన్

కుల మెసఁగ న్నిరంతరము గోరుదు రీవెసఁ బాలు పెట్టకే
కలఁతు రటయ్య వారు భుజ గర్వ సమగ్రులు మీరు విక్రమో
జ్జ్వలులరు వారు మీరు నొకవైపున కొగ్గినఁ దేఱి చూడఁగా
నలవియె దేవతా ప్రభున కైన వివేకము పట్టు కొల్పరే.

నెవ్వగఁ గూరి వారు జన నిందకుఁ బాల్పడి బిచ్చమెత్తిరే
నెవ్వరితమ్ములందురు మహీశ్వర! లోకము పాడితోడనే
నివ్వటిలున్ ప్రభుత్వ మవినీతికిఁ జొచ్చినఁ బ్రాభవమ్ము గా
దవ్వెడఁగాత్మ బంధు లనుయాయులుగూలుదు రొక్క పెట్టునన్.

నీవు నెఱి దప్పి పఱచితి వా విధంబు
చెడుఁ గులమ్మెల్లఁ గీడ్పడి చిచ్చు నుఱుకు
దుర్జయాన్వయ మానంద దోహలమున
మిన్ను ముట్టఁగ నీచేతనున్న దిపుడు.

నీకుం దీర్పఁగ నేర్పఁగ
సాకం బ్రాఁకింపఁ జాలు చదురు గలదు నీ
వాకున బాఁకునఁ బలనా
డూఁకొట్టుం జక్కఁ బెట్టు ముభయార్థంబుల్.

నీకతమ్మునఁ జెడినట్లు లోకమాడ
వలదు పుణ్యంబొ పాపంబొ వారిపైనిఁ
ద్రోవు మిందులకై తివా భావికాల
మాడిపోయును నీదుర్ణయ ప్రవృత్తి.

కుడుమిచ్చి వారిచే నీ
యడుగులు వట్టించు కొను మనంత శుభమ్ముల్
వడయు మఖండము రాజ్య
మ్మడుగడ లేకుండ నేలు మిటు గాదేనిన్.

తండ్రికడ చన్న బిడ్డల నిప్పాటునకుం దెచ్చి విడచె నందు రది యట్లుండె. తారన్నమేరకు సమయంబు నడపి వచ్చితి మనియు మావంక లేవేని దిద్ది గ్రాస వాసంబులకు వెలితి గానీక ప్రోవు మనియు నిరువాఁగుల నొక మెల్పున సంబా ళించు కొను భార మంద కలదనియు నింతవడియుఁ ద న్న మానుషము లాడమనియు దైవమ్మునూఁదిపట్టి తమ భాగలబ్ధి కట్టులు చాఁచితిమనియు శైవ వైష్ణవ విభేదం బులు వాటించి మిమ్ము మమ్మింత కీడ్చెడివారి ననదుగాఁ గైకొందు మనియు నింక నేమేమొ చెవిగొట్టి చెప్పిరి. ఇంత పేదవడిన వారి నాదుకొను టెంతయు నుచితం బని తోఁచును. ఇది యంతయు నీ వెఱుంగుదువైన నింత చెప్పవలసి వచ్చినందులకు నన్ను నేనాడు కొందుననఁ జెవి దోరగిల వినుచున్న నాయకురా లుక్కు మిగిలి,

పేదవడిన వారి నాదుకొ మ్మందువే
యాదుకొందు రయ్య లఖిల జగము
నిందు రాజ్యభాగ మెవ రబ్బ సొమ్మని
యడుగఁ బంచినారలయ్య నిన్ను.

గొంకరాజు నాఁడు కూఁతురు మైలమ్మ
కరణమిచ్చి పంచినట్టి భూమి
వీరవిజ్జలా కుమార రత్నములకుఁ
గట్టఁబెట్టు మందు విట్టఁడున్న.

వారి కిత్తు రేని భూరమా సుతులకు
జిట్టెఁడేనిఁ బాలు పెట్టవలదె
యంతు దెలియకన్న నం బేదలై వీరు
కొల్చినట్లు దుదికిఁ దేల్చితీవు.

మైలమాంబ సుతుఁడు మాన దుర్యోధనుఁ
డీ పరిస్థితులు గ్రహింపకున్న
యధిపు పిదప నీవ యధినాయకుఁడ వౌదు
వాత్మజాత నిచ్చి నందుకతన.

శైవ వైష్ణవ ప్రసక్తిఁ దెచ్చితి వెవ్వఁ
డీ తతంగములకు నెత్తె మున్ను
చాపకూడుఁ గుడిపి సర్వం జగన్నాథ
మెవఁడొనర్చెఁ దెల్పవే మహాత్మ!

ఇంత పడితిమంటి వెవరి కతమ్మునఁ
బడితి రుక్కు దక్కి చెడితిరయ్య
మాయ వైష్ణవమ్ము మంటపాలై పోను
నెన్ని కొంపలార్చె నీ విధాన.

గ్రాస వాసములకుఁ గా వంకలం దిద్ది
త్రిప్పు లుడిపి తమ్ముఁ దీర్చవలెనె
దైవమూఁది సమయ తాత్పర్య మెఱిఁగిన
బంకు లారుల కాస పడరు చెడరు.

నాఁడు నేఁడు జగము కోడయి కూసినఁ
బూరపులన్ని కప్పి పుచ్చుకొంద్రు
కూటు వేర్చి కొంప కూల్చుటకే గదా
పొలకువేది వలస పోవుటెల్ల.

అన్న హృదయ మ్మెఱింగిన వలంతు లింతదనుక రానేల. మాకరాజు కాళ్ళువట్టి మన్నెభూములు గుత్తగొని మడి మాన్యములు సంపాదించిరే. వారికిఁ జేరెఁడు వల్లనేమిగా నున్నది. జమ్మిగట్లేలు తమ కీనాగులేటి పట్టెనేల నేల బుద్ధిపుట్టెనో ! చంద్రవంక 'పరగణా' నేఁటికిం దమ యధీన మందున్నదని బాసాడు చుండిరటే. మఱియుఁ జిట్టేలనాములు కన్నుకొట్టింపక విడచిరేల. ఏలేశ్వరపు వట్టిపట్లు పలనాటి కెళవుల కైనవి గావని బహివెట్టిరటె. నలగొండ మదుగు లాఁకట్టిరని కూయి వచ్చినది.

గుత్తికొండ బెళం బెన్నఁడో కైవస మైనదని చంకలు దాఁటించుచుంటి రటగా. నాగార్జున కొండం దొట్టి శ్రీశైల భూ భాగ పర్యంత మాస్వాముల కసివారు బయళ్ళయ్యె నని వినుచుంటిమి. ఇఁక మాయేల్బడి కిం దేమున్నది. తా రేమొగమ్మున నడుగుదురు. మే మే మొగమ్మునఁ బంతుము. ఇంత కాచారమాత్రోపక్రమ ముగా నీ తంతునడపి రనుకొందుము. తమ కీనంత మాత్ర మునఁ దగవేది నల్వు రెత్తినత్తురా! వత్తురు గా కేమి పావుకొందురో యొకవేళ యుద్ధమే ఘోసంగిన నది క్షత్ర ధర్మానువృత్తి కగును. అందును లావున నేలఁగొనం దలంచు టెంతయుఁ బ్రతిష్ఠాపాదకంబగు. ఇందుఁ జెప్పెడి వారి ననసేల. ఊఁకొనువా రంత మతిమాలి రను కొంటివో! పరార్థ మెప్పట్టునను మీయట్టిఁడు లపేక్షింతురు గాని యన్యుల కెంతేనియుం గొఱగాదు. ఐనఁ గులమొసంగిన బలం బెసఁగునను మాట మీరాడునది గాదు. కను వొడిచి కన్నీ రడిగెద రేల. వారు వీరొక కట్టై యెటుదూలిన మా కూడిపడున దేమి? లోఁగడఁ దిరిసి బ్రతుకుట లేదనియా! మామల పరువు నిల్పి వచ్చితిరి. పోనిం డీరాజుపేక్షించినఁ దల్లకిందగున దేమి. తా రీ కులక్షయమున కోప కుపేక్షింపఁ జనదా! అట్లైన సర్వము సుభిక్షంబై చనదే. అది మాత్ర మయ్యలకుం గొఱగాదు. ఈ పాప పుణ్యంబులు పరులపై నటిమి లోక మొక దూఱువెట్టు నంత కుపేక్షింతురు గావలయు.

ఆపైఁ దక్కుంగల పను లరసికొందుగాత మలరాజా! ఎంత గడుసరి వయ్యా! కల్లు కంఠమునఁ బెట్టి దిబ్బి నాహరింప నుంకించితి వీవిషయ మాయయ్య కడం జదువు మవసరము లుగ్గడింపక పోఁడని నరసింగరాజు నుపలక్షించుచు నించుక ముకుఁజెఱమ లల్లార్చె. అంత రాచమల్లుఁ డామాటలు గీటునం బుచ్చి,

పతి సెడఁ దలఁచిన విను నీ
యతివ కఱద ల్లుల్ల కుట్టు లాడం దగునే
మతిమంతులు ధృతిమంతులు
సతతము నినుఁగొల్తు రిట్టి చావడమేలా!

అన్న పెద్దన్న బాహాప్పళించిన నాఁడు
తలపోయుదురు భుజాదర్ప గరిమ
రావీరు కనుదోయి కావి రేకలు దీర్ప
ననుభవించెదరు శౌర్యాగ్నిదీప్తి
బాలుని తగరు వార్వము పల్లటిలునాఁడు
చవి చూచెదరు రాజసప్రవృత్తి
కన్నమ భైరవ ఖడ్గ మూనిన నాఁడు
దొప్పదోఁగుదురు నెత్తురుబయళ్ళ

పోటుమన్నీలు డెబ్బది మూవు రదర
సర్వదార్వారు వీరనాయకులు దొడర
పాలికలను వల్లకాడయి పోయినపుడు
రాచవారెల్లఁ దలపట్టి చూచుకొంద్రు.

ఈబిడ మూలమ్మున మీా
గూబలు పిండెదరు పొట్టకొంబకై దూబల్
ప్రాబల్య మెఱుఁగనీయరు
తాఁ బసివట్టుటయ మేలు ధరణీపతికిన్.

అతిరథులు మహారథు లు
ద్ధతులు పతుల్ గలరు కోశదార్ఢ్యము గలదన్
మతి మిన్నకుంటి వవతల
నతలోకుం డొక్క బ్రహ్మనాయఁడు చాలున్.

ఏఁడీ కన్నమ దాసున
కీడగు యోధాగ్రగణ్యుఁ డీవల నతఁడే
జాడంబొల్చిన నటురా
నోడుం జమ్ముఁడైన నతని నోర్వం దరమే.

కలరిటు గంగుముఖ్యు లరిఘస్మరు లప్రతిమాన బాహు వీ
ర్యులు ఫలమేమి వీరుభయు లొక్కెడఁ గూడి భవద్బలంబులై
మెలఁగిన నెంతయొప్పెడుఁజుమీా!యననాయకురాలునవ్వుచుం
బలికెఁ గుమార నీకతన బాగుపడుం దగ సంఘటింపవే.

ఊరక వారి వీరి విభవోన్నతు లెన్నదు గాని వాని లో
సారముఁ దేల్పఁబోవుభయసంభ్రమముల్ గలిగించిమమ్ము మా
వారిని లోఁగొనం దలఁతువా! ప్రకృతమ్మున కింపుగాని యీ
ధోరణి కర్థమేమి వలఁతుల్ ప్రకృతాంశము లుజ్జగింతురా!

మునుకొని మమ్ముదల్చుటకు ముక్కిడిమూఁకలఁ బ్రోవుసేసి మీ
మ్మనిచిరొకో ప్రచారమునకై యుడతూఁపుల వేఁపలూఁగునా
ఘనుఁడల బ్రహ్మనాయఁడిటు కల్పన సేసిన వెల్ల నీక్రియన్
వినిచెదు మిమ్ము మెచ్చుకొను వీఱేఁడి లేఁడిట రాజనందనా!

ఏను నృపాలపక్షమున నింత వచించెద గ్రాసవాసముల్
గాని మఱొండు గోరమనిగా మలిదేవులు నిన్నుఁబంచి ర
క్షైనఁ దదీయ భుక్తికి సహాయ మొనర్తు మసహ్య కార్యముల్
మాని భజింప రండనుము మాన ధనాగ్రణు లీయకొందురా!

శీలము బ్రహ్మనాయఁ డెదిసెప్పినఁ జేయుదు రాతఁ డిప్పు డి
ల్వేలుపు పంగనామములు వెట్టు మహాత్ములు వేల్పులేమి యా
వేలుపుతాత లౌదురని విందుము కందు మనన్ దదీయ వా
చాలత కేవగించుచు విశాంపతి కిట్లను మల్లుఁ డో ప్రభూ!

ఆయమ్మ ముట్టి పల్కిన
శ్రేయస్సున కగుదు రిచ్చసిరి యింతని పా
ల్సేయుఁడు కాయో! కసరో!
యాయయ్యలు తిందు రందు రది మీకేలా!

మిముఁ గొలిచి పరిజనమ్ముల
క్రమమున నిందుండి మెప్పు గడలు గొనంగా
శ్రమ కోల్లరు చీఁకటి కొం
గమరుచుకొని తరలు వారి నాపవశంబే.

అరణపు భూమికిఁ దగరని
కొటిగాములు వల్కెఁ గాదు కూడ దటన్నన్
బిరువీఁకగు నీరాజ్య
స్థిరతకుఁ గొరకుఁ డెవండు చెప్ప రదేలా !

గడిభూముల మన్నెమ్ముల
నెడపెడ నిర్జించి కలిపి రీనాఁట నదీ
వడువున విస్తృతమై పరు
లడుగిడుటకు భయదమైన దది మఱచితిరా !

దొడ్డనాయఁ డెంత దోర్బల మెసకొల్పె
బ్రహ్మనాయఁ డెంత ప్రతిభ నెఱపె
వారి బలిమి కలిమి వర్ధిల్లు టెఱిఁగియు
నింత కట్టఁ గుడువ నెరియనేల.

వారికి లోటులేదు గుణవంతులు శాంతులు స్థైర్య ధైర్య వి
స్తారు లుదార చిత్తు లవధాన పరాయణు లీ రవంత పా
లూరక తార్చి గైకొనుట కొల్ల రటుల్ గయికోఁ దలంచినన్
మూరుతమైనఁ బట్టదిది మోఱకు లౌనన రీసు పెంపునన్.

ఇచ్చితిరా ! సరే తగిన టీక పెనంగిన మిమ్ము మీ బలం
బిచ్చట గ్రొచ్చి పాతుదు రిఁకేమనుకొన్న ఫలంబులేదు మీ
రచ్చలు రంగభూములును రమ్యవనాంతర సీమ లన్నియున్
బుచ్చలుగచ్చలున్ మొలచి పొల్పఱిపోవుననన్ మహోగ్రుఁడై.

యువరాజు నృసింహుఁడు భూ
ధవు మోముం జూచి కోప తాపము పేర్మిన్
లివ సూపు త్రాఁచు కైవడిఁ
గవసెదు క్రొల్వులి విధానఁ గనలి వచించెన్.

అల్లుఁడ వింత కొండొకరుఁడైనఁ బరిస్థితు లెంతకానో నీ
యుల్ల మెఱుంగు మత్కర సముత్థిత ఖడ్గ మెఱుంగు నోటికిం
గళ్ళెము దక్కి సుంత మముఁ గైకొన కాడెద వంతవాఁడు రా
జుల్లసముల్ సహించె నెవ రోర్చెద రీ పలుగాకి పోకడల్.

నీవొక కోపుఁ దీసికొని నిల్వుము ముక్కున నావియున్న మ
ద్దేవుల పాటు చూతు రొఱదీయక గెల్తుము మిమ్ము మీ బల
శ్రీ విభవమ్ములన్ సరకు సేయము దేవుఁడు డిగ్గి వచ్చినన్
గావఁగ లేఁడు పోయి మొనకట్టి రణ మ్మొనరింప రం డిఁకన్.

ఈయ మిఁకీయ మిందులవమేనియు నెత్తినిఁ గొమ్ము మొల్చె తాఁ
జేయున దేమొ చూతుమటఁ జెప్పుము పోయిన మోముతోడ మీ
దాయల నుక్కడంచి వసుధాతలమున్ గొనుఁడన్న వారటం
చీయడకించు మాటల కొకించుకయుం బుఱిలోడ రీయెడన్.

అంత మమకారమున్న మీ యబ్బసొమ్ము
పంచి కుడుపుము దాయల భాగ మిచటఁ
దేరగా నున్నదని బయ ల్దేఱినావు
కితవులకు రొట్టె కడ గిజగిజలు సూవె.

తమ్ముఁ దమవారిఁ బొగడి పెద్దఱిక మంటఁ
గట్టితివె యావ దఱిఁగినఁ గడవ కగునె
పొడిచి గెలిచెడివారింత పొగడి కొనరు
బయలఁద్రువ ప్రొయుఁ గురియని మొయిళు లడరి.

కనులఁ గెంపు గదురఁగాఁ జూతు వూరక
యాడు గఱతు పూర్తు వారటెంతు
వంటి వంత కిబ్బడనిపించు కొంటివి
నిం చుడుట్టఱికము నెఱపి తిపుడు.

ఈకౌటిల్యము లింపని
మాకుండగఁ బోలదని క్షమాపతి హితవున్
గైకొన కేగెన్ నాగమ
తేఁకువ మెయి నటు మొగమ్ముఁ ద్రిప్పి హసించెన్.

బగ్గరాజాదు లది సైరింప కలరాజు తలంపు లూడుకొనఁ జూచునెడ గౌతరాజు వారి నెచ్చరించి సాంత్వనమ్ములం దేర్చె. అంత నలగాముఁ డీ విధానం బింతలంతలఁ దీరునదిగాదు. తమ్ముని మాటలం గొంత తెఱంగువడి యున్నదైన జేపకడఁ జూచుకొందమని సదృష్టిక్షేపముగా నలరాజు నాదరించె. అతఁ డా పొల్లుమాట లెక్కసేయక కొని తదీయానుచరుల వాహనం బలవరింపుఁడని కొలువు

నతున్ మ్రొక్కి మ్రొక్కించుకొని మామకుం జేయూత నాయకురాలిచే ననిపించుకొని కొలువు కలయంజూచి కన్నమ మున్నుగాఁ దా వెన్కగా శూన్యహృదయమ్మున ద్వారప్రదేశాభిముఖుం డయ్యె. అంతం దత్రత్యుల చిత్తమ్ము లుత్తలంపడియు నూహ లురవడించె. ఒడళ్ళాఁచవడియు నూర్పు లురియాడె. ఇంతవడియుం దదీయ దృష్టులు చెర్లగుడిపాటి మార్గమ్ము వట్టి చను నమ్మూర్తి విశేషముం దవిలి కొంతవడి కెట్లో రిత్తబయళ్ల నత్తమిల్లె.

అదిసుత తత్ప్రదేశము లహర్నిశ మయ్యలరాజు గాథలన్
జదివిన వంధ్ర వీర పరిషత్ప్రసర త్పురుషార్థ చర్చలన్
బాదలిన వాత్మ పౌరుష సముజ్జ్వల దిగ్వలయాగ్ర వీధులన్
మెదలిన వాకథల్ వినిన మేన్పులకింపని యాంధ్రు లుందురా!